శ్రీరస్తు.

అవిఘ్నమస్తు.

# MESMERISM.

# మనోశక్తి.

ఇయ్యది

నెల్లూరితాలూకా మోదుకూరువాస్తవ్యులగు

మహారాజశ్రీ మొగనాటి రఘుపతిరాయుగారి పుత్రుండగు

మెస్మరిస్టును అగు

వేణుగోపాలమూర్తిరాయు వలన

రచియింపబడి ప్రకటింపబడినది.

మొదటికూర్పు 1000 కాపీలు.

గుంటూరు [illegible] ముద్రాక్షరశాలయందు

కే. వి. కృష్ణారావుచే

ముద్రింపబడినది.

1919.

 [వెల రు. 1—0—0.

## M. V. MOORTHI RAJU,
Mesmerist.



ముగసాటి వేణుగోపాలమూర్తిరాజు

గ్రంథకర్త.

## అవిఘ్నమస్తు.

ఉ॥ శ్రీయుతసత్ప్రవర్తనముచే ననయంబును పెంపుజెందుచున్
న్యాయసుముఖ్యమంచును ధనాఢ్యులు బీదలు నెల్లవార్ధ
లున్ । కాయముకష్టమంచు మదిగాంచక సంతసమంద
పాటులన్ । జేయుచు నిత్యమున్ గనుపు చిన్నిపురంబగు
మొంగునూరున్ ॥

సీ॥ సకలజనులను మొగసాటివారన్నను వసుధసంతసము ని
ప్పారుచుండి । వాసిగాంచినసుధీ వంశాబ్ధికెల్లను పూర్ణహి
మాంశునిం బోలుమూర్తిన్ । రాట్కవి జనియించి రాజ
ధానులయందు పలుమారు సభల మెప్పులను జెంది । శా
శ్వతకీర్తి నిస్సంశయంబుగ గొన్న సుహాసీయునకు వెంక
మాంబవలన । ప్రథమసుతుండయి పలువురచే లౌకికము
నందు సంస్కృతాంధ్రములయందు । గౌరవంబును జెంది
మేరశేనట్టి దయారసంబును జూపి యశముగాంచి । నట్టి
రఘుపతిరాయ కర్ధాంగలక్ష్మి । యైన పద్మాంబ గర్భమం
దైకసుతుండు । భవ్యనాముండు వేణుగోపాలమూర్తి । రాజ
టాచును ప్రజలు నెల్లరును బిలువ ॥

చ॥ చదివితికాంచమాంధ్రమును సంతసమొప్పగ నాంగ్లభా
షయున్ । ముదమున నేర్పెనంచినను ముఖ్యముగాగల పా
ఠశాలలన్ । వదలక యొప్పజేసి యతిబాల్యమునందు నె
నీడి శ్రద్ధతో । చనువగ జేసినందులకు సాగిలిమ్రొక్కెద
తల్లిదండ్రికిన్ ॥

ఉ॥ ఏకసుతుండనౌ కతన నింతని చెప్పగరాని ప్రేముడిన్ । నా
కడజూపిరన్ చదువునష్టముగల్గునటంచు సాధ్యమా । దా
కను గుప్తమందిడి ముదంబుగ నాంగ్లము నేర్పుచుండగా।
జోకొనరించు మెస్మరిజ చోద్యములన్ పలు జేయ నేర్చితిన్॥

ఉ॥ లేనటువంటి వానిని బలేయని యచ్చెరువొంద నేకముల్ ।
గానుపడంగ జేయుచును కష్టతరంబగునట్టి రోగముల్ ।
మానగ జేయు మెస్మరిజమం దభివృద్ధిని జేయ ప్రీతితో ।
పూనిక జేసితో డ్పడెను పుణ్యుడు ముఖ్యుడు మిత్రులందరన్॥

ఉ॥ అట్టిపరోపకారి సుగుణాఢ్యుడు మేలగు కమ్మవారిలో । బు
ట్టెను కొత్తవంశమున పూర్ణసుధాంశుడనంగ ప్రేమతో ।
బెట్టిరి సీతరామయను పేరును పండిత శ్రేష్ఠులెల్లరున్ ।
పుట్టినజాలు నిప్పగిది పుత్రుడె యొక్కడు తల్లిదండ్రికిన్॥

మ॥ అనయంబద్భుత కార్యముల్ పలువు రత్యానందమున్ జెంద
గా । మనసొప్పారగ జేసి యెల్లరను సామాన్యంబుగా మి
త్రులే । యన నన్నెందరో యాదరించునటు లత్యాసక్తి
తో నేర్చి మిం । చిన పేరున్న నినాడ మెస్మరికు ఫీట్చిత్రం
బులన్ జూపుటన్ ॥

మ॥ మనదేశంబున నెల్లవారలచె సన్మానంబునుం జెంది గొ
ప్పనుగాంచెన్ మును, కాని ప్రస్తుతము రవ్వంతైన నెవ్వా
నికిన్ । మనమందించుక యైన దీనియెడ సన్మానంబె లేకుం
డ గా । పున నీ మెస్మరిజంబు నేర్చి మరలన్ పూర్వస్థితిన్
జెందుడీ ॥

తే॥గీ॥ సకలదేశంబులందు విస్తారమైన । యశము నలుదిశలకు
బంపినట్టి దేశ । మిపుడదేమొకొ యెవరికి నించుకైన ।
దెలియకుండెడి హీనమౌ స్థితిని జెందె ॥

తే॥గీ॥ మున్ను పలువురచే కీర్తిగన్నయట్లు । మరల ప్రతివారు
దానిసంపాదనముకు । భక్తితోడుత నీమనోశక్తియనెడు ।
మెస్మరిజ గ్రంథమునుజూచి మేలుగనుడి ॥

---

# పీఠిక

ప్రస్తుతకాలంబున మన హిందూదేశమునందు మెస్మరిజమను మహాశక్తి నానాటికి క్షీణించుచున్నది. విదేశీయుల మహోన్నతదశను గురించి చదివినప్పుడుగాని వినినప్పుడుగాని మనదేశముగూడ నట్టి గొప్పదశ నెప్పుడు పొందునాయని మిక్కిలి విచారపడవలసి వచ్చుచున్నది. ఇంతియేగాక మనదేశీయులలో నెవ్వరైన నిమెస్మరిజ మభ్యసించినవారుండిన నితరులను నేర్చుకొనుటకై ప్రోత్సాహము చేయుటకు బదులుగా తామొక్కరే గౌరవమును బొందవలెనని యెంచి తమలో తాము దాచియుంచుకొనుచున్నారు. మరియు కొంతమంది బుద్ధిమంతులు గ్రంథములువ్రాయ పలువురకు వానియందు నమ్మకములేని హేతువుచే దేశమందెల్ల యెడల నల్లుకొనకుండగ నొకరికొకర ధైర్యమును వెల్లడించుచున్నారు. తత్కారణమున ప్రతివారికిని మెస్మరిజమునందు మిక్కిలి నమ్మకమును గలుగజేయుటకై తెలుగుభాషయందు మనోశక్తి యను యీ మెస్మరిజపు గ్రంథమును నాప్రియమిత్రులగు కొత్త సీతారామయ్య మొదలగువారలు మిక్కిలి పట్టుదలతో నాయుద్యమమునకు తోడ్పడిన కారణంబున స్వానుభవముచే రచియించి ముద్రింపించడమైనది.

ఇట్లు

యం. వి. మూర్తిరాజు,

మెస్మరిస్టు.



# మనోశక్తి

---

ఈ భూలోకంబున మనుష్యులై పుట్టిన వారందరును పొందదగిన కార్యములలో ముఖ్యమైనది జ్ఞానము. ఏపని జేయుటకైనను జ్ఞానమే ముఖ్యాధారమై యున్నది. ఇట్టి జ్ఞానవంతులకు లోకమునందు చేయరాని కార్యము లేదు. మనస్సును నిగ్రహించి మహానుభావులైనవారు ప్రతివారికిని గావలసిన కార్యములను సాధించియిచ్చుటకు శక్తులగుదురు. మనస్సును తనయిష్టమువచ్చినట్లు చొరనీక వశము జేసికొని పరిశుద్ధజ్ఞానమును పొందినవారు పూర్వము మనదేశమునందనేకులు గలరు. ఇప్పటికిని యమెరికాదేశమునందు మనస్సుచే చేయదగిన యద్భుతకార్యముల నెన్నింటినో చేసి మిక్కిలివన్నెకెక్కి యున్నతదశనొంది ప్రకాశించుచున్నారు. పిల్లవానిని నిరాధారముగ గాలిలో నిలుచుండబెట్టుటయును, సమాధులం బ్రవేశించి రెండుమూడు నెలలకు పిమ్మట ప్రాణముతో వెలికివచ్చుటయును, ఒకేకాలమున ననేకచోటులయందు గానుపించుటయును, యాకాశమున పెక్కద్భుతకార్యములను జూపించుటయును, తానుజెప్పున దితరులొప్పుకొనునట్లు జేయుటయును మనుజులను తదితరమృగములను నిద్రపోవునట్లు జేయుటయును, మరల నిద్రనుండి లేపుటయును, తానేచెడ్డకార్యమును జేసిన నితరులకు మంచిగానుండునట్లు జూపుటయును, చాల

దూరమువనున్నవా రేమిచేయుచున్నది జెప్పుటయును, తా నితరులకు వికృతాకారముగ గనుపించి భయకంపితులను జే యుటయును, తన శరీరమును మేలిమిబంగారు వన్నెవలె భ్ర మింపజేయగల శక్తిని జూపించుటయును, వస్తువులయొక్క రు చులను భేదముగజేసి చూపించుటయును, యింక మనసుచే నూహింపరాని కార్యములను జేసి జనులనందర నాశ్చర్యము గావించుటయును యీమనోశక్తియనెడు సుస్మరిజమువల్లనే జరుగుచున్నవనుట వేరుగజెప్ప నవసరములేదు.

ఇట్టి మహాత్తుగల్గినట్టి మనోశక్తిని పొందినయెడ దేహ మును వ్యాధిబారి బడనీయకుండుటయేగాక నితరులకుగూడ సంకటములు గలుగకుండ చేయగలవాడగును. కాబట్టి అట్టి వానిని జూచిన ప్రతివారును మిక్కిలి భక్తితో గౌరవించుచుం దురు. లోకమునకంతయు ప్రాణమిత్రుడై యుండును. వానియం దే దేవతాస్వభావము గలదని యందరును భ్రమింతురు. పూర్వకాలంబున యోగము, తపము, మంత్రము మొదలైన వన్నియును నేర్చుకొనవలెనన్న సంసారసుఖములనువదలివేయు వలెనని యొకవాడుకయై యున్నది. కాని ప్రస్తుతప్రపంచము న నాటినాటికి మరికొన్ని సులభమార్గములను కనిపెట్టి యుం డుటచేసన్యాసాశ్రమమునుబొందవలసినయవసరము లేనట్లగుప డుచున్నది. ఈమనోశక్తిని సంపాదించుటకు పూర్వమువలె ననేకవత్సరము లనావశ్యకము ఇట్టియభ్యాసమునుజేయుటకై ప్రతిదినమును సుమారొకయరగంటకాలము చాలును. ప్రతి దినము తప్పకఒకయరగంటకాలము సాధనము (practice) చే

యుచుండిన మూఁడు లేక నాలుగుమాసములకు సిద్ధినిపొందుట నిర్వివాదాంశము. పిమ్మటయీ మనోశక్తిచే మనమనేక కార్యములను చేయవచ్చును యిట్లు చేయు కార్యములు మిక్కిలి వింతగా గనుపించును. అందుచుబట్టి ఆ యీ భాగములకు ప్రత్యేక పేర్లను బెట్టియున్నారు. ఆవన్నియును మనోశక్తివల్లనే జరుగుచున్నవి. ఈమనోశక్తిని బాగుగ సంపాదించినవారికి ప్రపంచమునం దేదియును సాధ్యముగాకపోదు. గణితశాస్త్రము, ఖగోళశాస్త్రము మొదలగునవికూడను మనోశక్తిచే సాధింపబడుచున్నవిగాని మరొకదానిచేతగాదు. మనశాస్త్రజ్ఞులు ప్రమాణము చెప్పుచుగల్గునదియును చెప్పుచుండుట లేదా? యిట్లు చెప్పినదానికెన్నడైన భంగము కలుగుచున్నదా? లేదు. లేదు.

చూచితిరా, యిదంతయును మనోశక్తివల్లనే కలుగుచున్నది. ఈమనోశక్తియనునది నికగుపడుచున్నదా? లేనియెడల దీనిమహిమ నికెట్లు తెలియుచున్నది? మనస్సునందుండివచ్చెడిశక్తి ప్రపంచమునందెవ్వరి కనులకును గానుపించకేయున్నను, దానివలనజరుగుపనులు మాత్రము మనకెల్లరకును గానుపించును. ఎట్లనగా, చుండూరినుండి రాజమండ్రికేదేని సమాచారము బంపవలసినయెడల చుండూరునద్దనున్న వారు టెలిగ్రాఫుయాఫీసులోనున్న యొకకడ్డీని వత్తుచుందురు. ఆవత్తినప్పుడుగల్గు శబ్దము రాజమండ్రివద్ద వినబడుచుండును గాని మధ్యనున్నవారికెవ్వరికిని వినబడకయే పోవుచుండును. ఈతీగెలవల్ల నేమిజరుగుచున్నదియును తెలియక మనము చుండూరునుండి పంపినవార్త రాజమండ్రికి చేరుచున్నది.

కంటిరా! యీవిద్యుత్ ప్రవాహము కంటికి గోచరముగాక వార్తల నెంతటి విచిత్రముగ నైదారునిమిషములలో తీసి కొనిపోవుచున్నదో! యీవిద్యుత్ ప్రవాహము తీగెద్వారా బోవుచున్నట్లెవరికైన గాన్పించుచున్నదా? లేదు. లేదు.

అట్లే మనోశక్తి యెవరికిని గానుపించకపోయి నను దానివలనజరుగు పనులనుమాత్రము జూడగలుగుచు న్నాము. వేయేల? ప్రస్తుతకాలంబున వాయువార్తలు (Wireless Telegrams) పంపుచుండుటలేదా? చెన్నపురి లోచెప్పిన సమాచారము లండనునగరములో మధ్యనేమియు ను గానుపించకుండగ చేరుచుండుటలేదా? యిన్నియేల, దృష్టిచిత్రములో నాగుదూవలి యనినయెడల పోవుచున్నటు వంటి పాము, చీమ, కుక్క, నక్క, మొదలయినవి యాగు చుండుట మనము పలుమారు చూచుచునే యున్నాముకదా? ఇట్లు పోవుచున్నటువంటి జంతువులనుజూచి మనస్సులో దృష్టి ముగా యాగుమనవలెనన తప్పక నాగుచుండుట యెంతటి వింత యైన సంగతియైయున్నదో చదువరులే గ్రహింతురుగాక. మనోశక్తి నుపయోగించినప్పుడు మనకును పామునకును మధ్యనేమియును గానుపించుటలేదుగదా? కంటిరా మనో శక్తి యెవరికిని గానుపించకయే మనవద్దనుండిపోయి పాము నాపగలుగుచున్నది! ఇట్లే వాయు వార్తలు (Wireless Telegrams) కూడను మధ్య నెవ్వరికిని గాను పించకే చేరవలసిన స్థలమునుజేరి తనశక్తిని నొకవిధముగా జూప గలుగుచున్నది.

బాగుగ మెస్మరిజమును నేర్చినవాడు తనమనోశక్తివలన మిరపకాయను తీపిగాచేయుచుండుట మనమెల్లరమును చూచుచునే యున్నాముగదా! ఇది యంతయును చిత్తశక్తి (will Force) వల్లనే జరుగుచున్నది. సాధారణముగనుత్సవసమయములయందు మనలోని కొందరగ్నియందు దూకుచుండగ చూచుచున్నాముగదా! అట్లు నిప్పులోనికి దూకు మనుజునకు కాళ్ళుకాలకుండునా యని ప్రశ్నించిన, కాలకుండనే యున్నవని చెప్పుటకు సందియ మించుకయు లేదు. ఎందువల్లననిన నిప్పులోనికి దూకుసమయమునందు కాళ్ళు కాలవని దృఢచిత్తముతో దూకుచున్నాడు. గాన వాడిచ్చట మనోశక్తి నుపయోగించినాడు. తత్కారణమున వానికి నిప్పులవలన బాధ కొంచమైనను గలిగియుండలేదు.

పూర్వము వాల్మీకులవారు తపస్సు చేయుచుండగా నాతనిమీద పుట్టలు, చెట్లు మొదలయినవి పుట్టినను యాతని కించుకయు దెలియకుండెను. యా మహాత్ముని మనశ్శక్తి నంతయును శ్రీమన్నారాయణుని యందుంచిన సమయమున చెదలు, చీమలు మొదలయినవి కుట్టుచున్నను కొంచెమైన నొప్పినిబొందియుండలేదు. సాధారణముగ మనలో కొంత మందేదియో యొక విషయమునుగురించి తమ మనోశక్తితో నాలోచించు చుండుట తటస్థించిన సమయమున నెవ్వరైన నట్టిసమయమున పిలిచినచో నైదారు కేకలవరకును పలుకకుండుట పలుమారు చూచియే యున్నాముగదా! వినుటకు చెవులున్నను మనస్సు వేరుగా పనిజేయుచున్న కారణమున

వాడైదారు కేకలవరకును పలుకకుండుట తటస్థించినది. పూర్వము మనఋషులలో శపించిరన్న యేమనియర్థమో గనుగొంటిరా! మనోశక్తిచే నేదియో యొకవిధంబుగదూషించుట యని యర్థము. అట్లు మనోశక్తిచే నేమాటయన్నను తప్పక జరిగినట్లు పురాణములయందనేకము లగుపడుచున్నవి. కావున మనోశక్తికన్న రెండవది యెక్కువ లేదని పలువిధముల ప్రతిమానవునకును తెలియవచ్చుచున్నది. శకుంతల దుష్యంతుని వివాహము జేసికొన్న సంగతినంతయును కణ్వమహర్షి తన మనోశక్తివలన గ్రహించియుండలేదా!

ఒకనిని యొకపాము గరచెననుకొనుడు. అప్పుడీ మనోశక్తిని సంపాదించినవాడుండుట తటస్థించినయెడల పాముకాటుచే కరువబడినవానిని సులభముగా బ్రతికింప గలవాడగును. ఎట్లన. "పామువిషము నీదేహమునందు బ్రవేశించినను నిన్నేమియుచేయజాలదు". అని నీలో నివాకరచిన చోటును జూచుచు గట్టిగా చనిపోవడను నమ్మకముతో నుండుము. కొంతసేపటికాపాముచే కరువబడినవాడు లేచి యెప్పటివాని వలెనే యుండును. చూచితిరా మనోశక్తివలన పాము విషముగూడ నేమియు చేయలేకయున్నది. కాబట్టి మిక్కిలి పట్టుదలతో నేదియైన నమ్మిచేసినచో నది కొనసాగునని నేను దృఢముగా చెప్పగలను. నెపోలియన్ అను మహాశయుడు మనోశక్తియనెడి యీమెస్మరిజమును బాగుగగుర్తెఱిగి యుండుటకారణంబున పెక్కద్భుత కార్యములను జేసినట్లు తెలియవచ్చుచున్నది.

పర్సనల్ మాగ్నెటిజమనియును, హిప్నాటిజమనియును, టెలిపతియనియును మొదలగునవనేక విధములపేర్లను బెట్టియున్నారుగాని యివన్నియును విచారింప నొకటిగనే గానుపించుచున్నవి. యీమనోశక్తివల్ల నితరులను లోబరుచుకొని మనకేది గావలయునో యది చేయించుకొనగలవారమగుదుము. అట్లు వాడు పనిజేయునప్పుడు తనంతటతాను జేయుచున్నాననుకొనునుగాని మనకుస్వాధీనమై మన మనోశక్తికి లొంగి చేయుచున్నానని యొకనాడును తలంచడు. యీపర్సనల్ మాగ్నెటిజము తెలిసియున్నచో యెవ్వడును మనలను స్వాధీనము చేసికొనలేడని యనుకొన్నను యట్టివాడు మనసమీపమునకు వచ్చినతోడనే వశ్యులగుదుము.

ఇట్టి మహాత్తుగలిగిన మనోశక్తియొక్క రహస్యమును గ్రహించినవానికి ప్రపంచమునందేదియును కష్టముగానుండదు. యిట్టి మహాత్తు గల్గిన మనోశక్తి వలన మిక్కిలివిచిత్రములయిన పనులను పెక్కింటిని జేసి జనులనెల్లరను సంతోషానంద భరితులనుగా చేయగలము. ప్రపంచమునందు సత్యమును సంతోషముగ కాలము గడుపువానికన్న మిక్కిలి గొప్పవారెందరారులెవ్వరు? నిక్కముగ భూలోకమునందట్టి మహాశయుని కది యొక స్వర్గభోగముగాక మరెయ్యది ?

రూపాయిని నడిపించుట.

మనకు వెనుకభాగమున నెవ్వరిని లేకుండునట్లు నియమించి మనకనులకు సుమారిరువది యంగుళములకు లోపుగ

నొకరూపాయిని భూమిమీదగాని లేక నేదైన నొక చదునైన పుస్తకముమీదగాని పెట్టి కొంతసేపు రూపాయిని నీకనులలో చూచుచు పిమ్మట దృఢచిత్తముతో కదలిరమ్మని మనసునందనుకొనుచున్న యెడల నొక నిమిషకాలమునకు కదలివచ్చుచుండును. కంటిరా మన మనోశక్తివలన రూపాయి చరచరప్రాణముగలదానివలె మిక్కిలి వేగముగ వచ్చుచుండును. నీకును రూపాయికిని మధ్య సుమారిరువదియంగుళముల దూరమున్నప్పటికిని మధ్య నేయాధారములేకయే పరుగెత్తుకొని వచ్చుచుంటటి యాశ్చర్యకరమైన విషయము.

ఇటువంటి శక్తిని సంపాదించుటకుగాను నీవు ప్రతిదినమును తెల్లవారుజామున సుమారు నాలుగున్నరగంటల కాలమున లేచి నిత్యకృత్యములను తీర్చుకొని వీలుగానుండిన ప్రవాహజలమునందుజలకమాడి సుమారయిదున్నరగంటలు లేక ఆరుగంటల సమయమునందు కృష్ణాజినముపై నుత్తరముఖముగ గూరుచుండి యిష్టదేవతాప్రార్థనంబొనరించి పిమ్మట నీ కెదురుగా సుమారొక యడుగుదూరమున నొక యద్దమును నీచేతులతో పట్టి యుంచి యదివరకు నీకనుబొమలమధ్య నుంచుకొనిన చాదుబొట్టును యద్దమునందు ప్రతిఫలించుదానిలో బాగుగ చూచుచుండుము. అట్లు చూచునప్పుడు నీనల్లగ్రుడ్లు రెండును నీకనురెప్పలకు మధ్యనుంచునట్లు చూచుచుండవలెను. అట్లుంచినగాని నీపీదృష్టిని సంపాదించినవాడవు కావు. తత్కారణమున చూపువిషయమై తగు జాగ్రత్తను ప్రతిదినమును తీసికొనుచుండనియెడల త్వరలో నీమనోశక్తిని సంపా

డించుటకు సాధ్యపడదు. ఇట్లు సుమారిరువది లేక ముప్పది దినములు తప్పకుండగ సాధనము (practice) చేసినయెడ దృష్టిచూచుట కలవాటుపడగలవు. అలవాటు గలిగిన తోడనే నీమనోశక్తిని చాల సులభముగ నుపయోగించగలవాడ వగుదువు. కాన చిత్రంబుల నెన్నియో ప్రచురించి పలువురను నీ స్నేహితులనుగా మార్చుకొనగలవు.

ఇటువంటి శక్తిగలిగిన మనోశక్తిని యభ్యసించిన పిమ్మట, నీవునునీ స్నేహితులును నొకదారిని నడచిపోవుచున్నారను కొనుము. అప్పుడొక త్రాచుపాము గనుపడినదనుకొనుము. స్నేహితులందరును పామునుజూచి భయమునొందుచున్నప్పుడు నీకీ మనోశక్తిలేకుండిన నీవుకూడ వారికన్న నెక్కువ భయమును జెంది పారిపోవుటకుగూడ ప్రయత్నము జేయుచుందువు. కాని నీకీమనోశక్తి గలిగియుండినకారణంబున భయమును జెందవలసిన యవసరము లేకపోవుటయేగాక నీస్నేహితులకు సహితము సాహసమును గలుగజేయుదువు.

ఎట్లన, నీకు పాముకనుపించినతోడనే దానికి రెండు మూడుగజముల దూరమునకు బొమ్ము. అప్పుడా త్రాచుపాము నిన్నుజూచి పడగవిప్పి యాడుచుండును. అంత పామిట్లాడుచుండగ నీకనులను బాగుగ తెరచి అనగా నీనల్లగ్రుడ్లు కనురెప్పలకు మధ్య నిల్పి పాముయొక్క పడగమీద చూచుచు దృఢమనంబున "నీకు నడచుటకు శక్తిలేదు. పడుకొనుము". అని పలుకుము. అంత నీతోనున్న స్నేహితులందరచ్చెరువంద నాపాము పడగవిప్పి బుసలుగొట్టుచు నొక్క పెట్టున

నాడుచుండుటకు బదులు మెల్లగా పడగను ముాసికొని భూమిపై బుసలుగొట్టుట మానివేసి పండుకొనును. ఇదిచూచుట కెల్లరకును వింతగనుండి నీయందేదో మహిమయున్నదని భ్రమించి ప్రతివారును నీకు స్నేహితులగుదురు ప్రపంచమున మనుజునకు గౌరవమునకన్న నెక్కువ ప్రీతికరమైనది రెండవది లేదని యెల్లరకును తెల్లంబేగదా! స్నేహితులకన్న నెక్కువగా మనకు తోడగువారు హితులు లేరనియును, మనమీ మనోశక్తిని సంపాదించిన ప్రాణస్నేహితులను పలువురను సంపాదింపగలమనియును, అట్టి ప్రాణస్నేహితు లుండుటంబట్టి మనకీప్రపంచమున నేయిక్కట్టులుగలుగననియును ప్రతివానికిని విశదమేయైయున్నది. స్నేహితుడనగా సుఖముగానున్నప్పుడు మనయొద్దనుండి కష్టములు సంప్రాప్తించునప్పుడు మనచెంతకు రాకుండువాడుమాత్రము కాడు. కష్టసుఖములకు తోడగువాడే స్నేహితుడనబడును. విశేషంబుగ స్నేహితులతో కాలముగడుపుట సంభవించినవాడు భాగ్యమేమని చెప్పవచ్చునో చదువరులే గ్రహింతురుగాక. నిత్యమును మంచిస్నేహితులతో కాలము గడపువానికి మనసునందేకళంకమును లేకయుండును. తత్కారణమున వాడు శుక్లపక్షపు చంద్రునివలె దినదినాభివృద్ధియై యోగబలమునందును, బుద్ధిబలమునందునుగూడ పెంపొంది ప్రతివారికిని చూచుటకెల్లప్పుడును సంతోషస్వాంతుడై యుండునట్లగుపడుటచే వానిని చూచువారు సయితము సంతోషముగ నుందురనుట వేరుగ చెప్పవలయునా!

వేయేల, మీ గ్రామమునం దెవ్వడైన నొకడు చని పోయినయెడల వాని బంధువులందరును జేరి ఘొల్లుమని యే డ్చుచుండగ సామాన్యముగా దారినబోవు ప్రతివారికిని దుః ఖమువచ్చుచుండుట మనము పలుమారు చూచుచునే యు న్నాముగద ? కారణంబేమన, యెట్టివారివద్దనుండిన మనకు గూడ నట్టి లక్షణంబులే యలవడుననుట లోకవిదితమై యు న్నది. "ఆరునెలలుసహవాసముచేసినవారు వీరగుదు"రను లో కవాకుక ప్రతిపిల్లవానికిని కూడ తెలిసియేయున్నది. తత్కా రణమున సాధ్యమైనంతవరకు మనము సత్సహవాసము మా త్రము చేయుచు దుస్సహవాసమును విసర్జించుచుండవలెను. అట్లు సత్సహవాసమును జేయుచుండిన మనకుగూడ సద్గుణ ములే యలవడును. గాన మనమెల్లరచే గౌరవింపబడుదుము. ఆహా ! సత్సహవాసమన నెంతటి విలువగలది ! దీనికి మించి నది వేరొండు లేదని ప్రతివారికిని గోచరమగుచున్నది. ఇదంత యును మనోశక్తివల్లనే కలుగుచున్నది.

నీవు మీ యింటికి సమీపముననున్న యొక చిన్ని మొ క్కను జూచి ప్రతిదినమూ చెట్టువద్ద కొంటరిగావెళ్ళి దానికె దురుగ సుమారైదారు నిమిషముల వరకు చూచుచు నీమన సునందు రెండవతలంపు లేకుండగ నీక్రింది విధమున తలంచు చుండుము. "నీకు పెరుగుటకు శక్తిలేదు, భూమినుండిగాని గాలినుండిగాని నీవాహారమును తీసికొనలేవు". ఇట్లు మూడు నాలుగు దినములు నీమనోశక్తిని మొక్కపై యుపయోగించి న చూచినవారందరాశ్చర్యముజెంద చెట్టెండియుండును.

ఆహా ! యేమియాశ్చర్యము ! నీవా చెట్టును ముట్టకొ నకుండగనే చంపగలుగుచున్నావే. నీ మనోశక్తియొక్క మహిమ యింతనివర్ణింప నెవ్వరితరము! మరియు బంగారునకు సువాసనయబ్బిన నెట్లుండునో యట్టిమాదిరీమనోశక్తికి జ్యోతి (Light)యనుకాంతిగూడ సహాయపడినయట్లుండును. యీ జ్యోతినిజూచుటకై కొంతవరకుదుర్లభమేయని చెప్పవలసినచ్చి నందులకు కొంచెము మనస్సంకటముగ నున్నది. అయినను మిక్కిలిపట్టుదలతో సాధనము (Practice) చేసినచో సిద్ధిని పొందుట నిశ్చయమేగాని దీనిని పొందుటకు కొంతయదృష్టముకూడ నుండవలెనని కొంతమంది నాతో చెప్పుచూవచ్చిరి కాని నాయభిప్రాయమందులకు భిన్నముగానున్నది. చదువరులారా! మీకుగూడ నాకుగలిగిన యభిప్రాయమే గలిగినయెడల త్వరలో జ్యోతిని జూడగలుగుదురని నేను మిక్కిలి గట్టిగానొక్కి వక్కాణింపగలను. నీవీజ్యోతిని చూడగలిగినతోడనే యింకను మిక్కిలి విచిత్రములైన పనులెన్నియో జేయగలవాడవగుదువు.

దారినిబోవువారిని పిలువకుండగ రప్పించుట.

---

నీవు నీస్నేహితులతో గూడి యొక యరుగుమీద కూర్చుండిన సమయమున నొక బాటసారి ప్రక్కనున్న బజారున బోవుచుండగా జూచితివనుకొనుము. పిమ్మట నీస్నేహితులను జూచి యిదిగో చూడుడు యీబాటసారిని పిలువకుండనే యిచ్చటకు రప్పించెదనని చెప్పి యాతని ముచ్చిలిగుంట మీద జూచుచున్న కొంతతడవునకు నీకొక జ్యోతి (కాంతి)

కనుపించును. బాటసారియొక్క ముఖము గనుపించుచుండిన కనుబొమలమధ్య జూచుచుండిన పైనజెప్పబడిన జ్యోతికను పించును. అప్పుడు నీమనోశక్తి ప్రతాప మాతనిపై నుపయోగించుము. "రమ్ము, నీవుమావద్దకురమ్ము" అని నీమనసునందనుకొనిన వెంటనే యాబాటసారి మీయందరివద్దకు వచ్చుట జూచి ప్రతివారును మిక్కిలి వింతనొందెదరు. కంటిరా మీ మనసున కెట్టిశక్తి గలిగియున్నదో! నీకు మనోశక్తి బాగుగ పట్టుబడిన మోడనే నిస్నేహితులయెదుట కొన్నివింత (Wonderful) యగు కార్యములనుజేసి వారిని పలుమారు సంతోష పెట్టగలవు. నేనింకను కొన్ని మిక్కిలియాశ్చర్యములగు వింతపనుల నెట్లుచేయునదియును వ్రాయ నెంచితినిగాని, గ్రంథవిస్తరభీతిచేతను, మరియు కొంతమంది మిత్రులుకూడ నదియే భీతినిజూపిన కారణంబునను కొన్ని స్వల్పపనుల నుదహరించకుండగమానితిని. అయిన నట్లు మాని వేసినపనులను యీగ్రంథమునం నుదహరించినవానినిబట్టి చదువరులే యోచించినవానిని జేసికొందురని మానివేయుట సంభవమాయెను. మరియు యీశక్తివలన మరికొన్ని క్రొత్తవింత లెట్లు చేయునది యును బుద్ధికుశలతచే గనిపెట్టి యెల్లరకును తెల్లంబగునట్లు మెల్లన నిమెస్మరిజపు గ్రంథంబుల నుల్లంబులు రంజిల్లగ వెల్లడింపజేయుటకై కొల్లగ గ్రంథంబులనెల్ల యెడల శీఘ్రముగా నల్లుకొనగ జేయుచు మీవల్లనె యీలోకంబున కొల్లగొన్నధాన్యమువలె ప్రజలెల్లరు నీశక్తినిసంపాదింపప్రోత్సాహము జేయబడుదురని నామనంబున గొప్పయాశయొకటిపొడముచున్నది.

నేనిదివరకుదహరించినపనులను జేయగలవానికి మనోశక్తి కొంతయలవడినదని చెప్పవచ్చును.

ఈతచువ్వలను కలసికొనునట్లుచేయుట.

మనదేశంబున విస్తారముగ నెల్లయెడల నెదుగుచుండెడి యీతచెట్టునుండి రెండుమూడుజానలపాటి చువ్వలను తెచ్చి యిద్దరు మనుజులను సమానయెత్తుగలవారిని యెదురెదురుగానిలుచుండబెట్టి యీతచువ్వల చివరభాగములను వారిద్దరి చేతులతో (చూపుడువ్రేలితోను బొటనవ్రేలితోను) పట్టుకొనునట్లు జేసి నడుముల కానించునట్లు జేయుము. ఇట్లుజేయునప్పుడు సుమారా యీతచువ్వలకు మధ్య నాలుగేడంగుళములుండును. తరువాత నీదృష్టి నుపయోగించి యీతచువ్వలనంకి జూచుచు "ఓ యీతచువ్వలార! మీరొండొంటితో త్వరగాకలిసికొనుడు. అట్లు కలిసికొనుటకై మీకొక విధమయిన శక్తినిచ్చుచున్నాను". అని నిమనోశక్తినుపయోగించుము. ఇట్లనుకొనుచున్న నిమిష కాలములో యీతచువ్వలు మెల్లమెల్లగా ప్రాణముగలవానివలె దగ్గిరకువంగి మధ్యప్రదేశమున నొకదానికొకటిదాకును ఆహా యెంతటి విపరీతము! యెవరికైన నెస్మెరిజమునందు ప్రవేశపెట్టదలచినయెడల నివిట్టి సులభమగు కార్యములను చేసిచూపించి నేర్చుకొనుటకై వారిని ప్రోత్సాహము చేయుచుండుము.

నిమ్మకాయలను పోట్లాడునట్లు జేయుట.

రెండునిమ్మపండ్లను తెచ్చి వాటిని మెత్తగానలిపియుంచి

నొకదానికొకటి సుమారైదంగుళముల దూరమునబెట్టి నీవు తూర్పుముఖముగా కాయలకు పన్నెండంగుళముల దూరమున కూర్చుండి "ఓనిమ్మకాయలార! మీరిద్దరును గొఱ్ఱెపొట్టేళ్లవలె కొంచముసేపు పోట్లాడిన నిచ్చటనుండువారందరును మీయద్భుతకార్యంబునుజూడ కుతూహలపడుచున్నారు గాన త్వరగా పోట్లాడుడు" అని నీదృష్టి నుపయోగించుచు మనోదృఢముతో నీలోనీవనుకొనుము. యిట్లు సుమారు రెండునిమిషము లనుకొనిన వెంటనే చూచువారందరాశ్చర్యమొంద నిజముగ గొఱ్ఱెపొట్టేళ్ళవలె నిమ్మకాయలు రెండును బహుపౌరుషముగ నీమనోశక్తి నుపయోగించినంత కాలము పోట్లాడుచునేయుండును. కంటిరా మనోశక్తివలన నెంతటి యాశ్చర్యములగు కార్యములను జేయవచ్చునో? యిట్టి సులభ పనులను పెక్కింటిని యవలీలగ జేయవచ్చును. గాన మనోశక్తిని సంపాదించుటకయి ప్రతిదినమును సర్వేశ్వరుని ప్రార్థింపరాదా! అట్లు ప్రార్థించినచో నీకట్టిశక్తి నీయకుండుట కంత నిర్దయుడా! కాదు, కాదు. కరుణారసపూరితుడై యెల్లరకును మిక్కిలి దగ్గరగుచుండును. గనుక మనోశక్తిగావలయునన్న సకలలోకాధీశ్వరుడగు యీశ్వరుని నీహృదయకమలమునందు ధ్యానించుచు మనోశక్తి నిపొందుటకు తగినసదుపాయములతో నభ్యాసము (Practice) ను దిట్టంబుగ జేయుచుండిన పట్టుబడకయుండుట వట్టిదిసుమా! యిట్టి మనోశక్తిని నాకుమిత్రుల యినవారలలో చాలమంది కొంచెము కొంచెముగా గలిగియుండిరి.

నేనొకనాటిసమయమున మాగ్రామమునకు మూడు
కూరుపురమున కాగ్నేయభాగమునందున్న వీరారెడ్డి చెఱువు
వద్దకు నాప్రాణమిత్రుడైన సంగముజాగర్లమూడి పురవాసి
మ॥రా॥రా॥శ్రీ. కొత్త సీతారామయ్యగారితో సాయంతన
మున షికారుకుబోవుచుండగ చెఱువునకు సామీప్యమునకోతి
యొకటియున్నదనియును దానిమెడయందొకగొలుసుకొక్క
ముకుటచేయీకోతి యెచ్చటనుండియో సర్కసునుండితప్పించు
కొనివచ్చినదనియును దారినిబోవువారినెల్లరను కఱచి గుడ్డలను
చింపివేసి పలుబాధల పెట్టుచున్నదనియును సాధులుకొంత
మంది మర్కటముచే ప్రాయశ్చిత్తమును జేయించుకున్నవారు
సైతము మమ్ములనిద్దర నాదారిని బోవలదని మిక్కిలిబలవంత
మును జేసియుండిరి గాని నేను మాత్ర మట్లువెళ్ళుటకు
సంశయించి యుండలేదు. నా మిత్రునకు నేని మ
నోశక్తిని జంతువులమీద కూడ జూపగలనని తెలియుకున్నం
గున కోతివలన నాకించుకయు హానిరాకుండ గాపాడవలెనని
తుండుగుడ్డను తనచేతికి చుట్టుకొని కోతిని పట్టుకొనుటకు ప
ద్ధపడుచుండెనుగాని, మిత్రమా నీవు నాకొరకిట్లు సాహసింప
వలసిన యవసరములేదని చెప్పుచుండగ నామర్కటము మ
మ్ముల నిద్దరను సమీపించి కఱచుటకు బహు తొందరపడు
చుండెను. నామిత్రుడు మిక్కిలి ధైర్యవంతుడును స్నేహితుల
యెడ ప్రాణమునైన నిచ్చివేయునటువంటివాడును యగుటచే
పరుగెత్తుకొనివచ్చు కోతిని పట్టుకొని కట్టివేయుటకు సిద్ధపడు
చుండగ "గరిటెయుండగ చేయిగాల్చుకొనన" నెట్టివాడైన యొప్పు

కానునా ? కాబట్టి నాకీమనోశక్తి గలిగియుండిన కారణంబున నాస్నేహితునకట్టి శ్రమనియ్యదలంచక నామనోశక్తిని విడిపించితిని. నాతోనున్న నామిత్రుడు మిక్కిలి యాశ్చర్యమును బొందునట్లుగా కోతి మామీదబడి మమ్ములను కష్టపెట్టుటకు బదులుగా నామనోశక్తివలన పిల్లివలె యేమియు జేయలేక మాయిద్దరను శరణుగోరవచ్చినదానివలె చిందులు, గంతులు, పండ్లుజూపి భయపెట్టుట, మొదలైనవానిని మాని మాపాదములయొద్దకువచ్చి కూరుచుండెను. నాప్రియమిత్రుడగు సీతారామయ్యగారికి వినోదములందు ప్రీతిగనుకను, నామనోశక్తి యొక్క మహిమను తెలియజూపినందుననను నేనింకను కొంతసేపు నామనోశక్తి నుపయోగించియుంటిని. పిమ్మట మాకు సామీప్యముననున్న కందేపాటిదిబ్బను నామిత్రుడు చూడనెంచిన మేమిద్దర మచ్చుటకుబోవుచుండగ పెంపుడుకుక్కవచ్చునట్లుగ యాకోతి మా వెంబడి గాసాగెను. అంత నాప్రియమిత్రుడు భూతదయగలవాడగుటచే, మిత్రమా, యింక నీకోతిని వెళ్ళునట్లుజేయుడని నన్నుకోరగా మరల నామనోశక్తిని దానిపై యుపయోగించి వెళ్ళునట్లుచేసి నామిత్రుని సంతోషానందభరితునింగావించియుంటిని. తదనంతర మాకోతి వెళ్ళుచుండగమార్గమధ్యమునందొకబ్రాహ్మణుడు ఎదురుపడుట తటస్థించెను. ఇదివరకువలె కోతి పాంథులను గష్టపెట్టుటకు మరల మొదలిడునప్పటికి కాలవశమున బ్రాహ్మణు డెదురుపడిన కారణమున కోతి యావిప్రుని సమీపించి కరచుటకు నోరు దెరచి మీదదుముకుటకు సిద్ధముగనుండు సమయమున పాప

మాయన గుండెలుఝల్లుమని భయంకరముగ నోటి వెట్టికే కను బిగ్గరగా వైచెను. నేనును సీతారామయ్యగారును దగ్గ రనేయుండిన కారణమున మాకిద్దరకును వినబడి వెనుకకు తిరి గి చూచితిమి. అంత నామిత్రుడు బ్రాహ్మణునిజూచి జాలిగొ న్నవాడై యాయనను కోతిబారినుండి తప్పింపుడని నన్ను కో రగా మరల నామిత్రుని యభీష్టము చొప్పుననే మనోశక్తిని యుపయోగించి బ్రాహ్మణునిబాధ శీఘ్రకాలములో తొలగిం చి యుంటిని.

కంటిరా! మన మనోశక్తివల్ల నెంతటి మహోపకార మొనర్చుచున్నామో! అట్టి సమయమున నీమనోశక్తియును నది లేకుండిన మాగతి యేమిగావలయునో; బాటసారియగు బ్రాహ్మణునిగతి యేమిగావలయునో; చదువరులే గ్రహింతురు గాక.

ఇదియునుగాక మరియొక్కపర్యాయము నా మిత్రులగు మ॥ రా॥ శ్రీ॥ కొత్త సీతారామయ్యగారును, జంపాల నారాయ ణమూర్తిగారును, దేవభక్తుని రామయ్యగారును నాతో నై నాలిపురమున నొకనాటిరాత్రి యొంటిగంట సమయమున నొక మిత్రుని గదికి బోవుచుండగ మార్గమధ్యమునందు ప ది పండ్రెండు కుక్కలు నలువైపులనుజేరి పెద్దగందరగోళము నుజేయ మొదలిడినప్పుడు నామిత్రులు నన్నుజూచి మిత్రమా యాకుక్కల నన్నిటిని యఱవకుండునట్లు జేయుడని నన్ను కోరిరి. నేనుగూడ నందులకంగీకరించి నామిత్రుల కాశ్చర్య మును గలుగజేయనెంచి కుక్కల నఱవకుండగజేసి వానినన్ని

టిని నావద్దకు రప్పించియుంటిని. వేయేల, మనోశక్తిని సంపాదించిన వానికి ప్రతివారును స్నేహితులగుదురనుట వేరుగ జెప్పవలెనా? మరియు రెండుసంవత్సరములక్రిందట ననగా నేనేమనోశక్తిని సంపాదించుటకు మొదలిడినప్పుడు తాడేపల్లిగూడెమునకు రాత్రి రెండుగంటలప్పుడు కటికి-చీకటిలో పడవదిగి రైల్వేస్టేషనువద్దకు రావలసివచ్చెను. అప్పుడాకాశమంతయును మేఘములచే నావరింపబడి సన్నగా వర్షముగురియుట నారంభించెను. అట్టిసమయమున పడవనుదిగినపిమ్మట నాకెవ్వరును తోడులేకుండుటగూడ తటస్థించెను. నేను పదునైదు వత్సరముల బాలుడనగుటచే నట్టిసమయమున రైల్వేస్టేషనునకు నొంటరిగా వచ్చుటకు భయముజెంది పోవుటకెంత మాత్రమును సాహసింపనైతి. కాని యప్పుడు తాడేపల్లిగూడెము రైల్వేస్టేషనునకు తెనాలిబోవునట్టి రైలుబండి యొకటి రాత్రి మూడుగంటలకాలమున వచ్చుచుండుటచే నొంటరిగానైనను బోవనుద్యుక్తుడనైతిని. అక్కటా, మరియొక బాలుడైనచో నట్టిసమయమున జరిగినవిపత్తునకు గుండెబ్రద్దలై ప్రాణంబులను గోల్పోవకయుండుట తటస్థించునా! అహో, ఆజరిగినవిషయమును మరల జ్ఞప్తికి దెచ్చుకున్నప్పుడు గుండెలు ఝల్లుమనుచున్నవి. మాటలు తడబడుచున్నవి. కళాహీనము గలుగుచున్నది. చేతులు కాళ్ళు గజగజ వణకుచున్నవి. అదెట్టిదో వింటిరా? బయలుదేరినపిమ్మట నైదారడుగులు వేసినతోడనే యాకాశమంతయు నల్లనిమేఘములచే: గప్పబడినందున నేను నడచుచున్నది రోడ్డుగనే యున్నప్పటికిని రోడ్డు

న కిరుప్రక్కల వటవృక్షములు గలిగియుండుటచే కన్నులెంత దెరచినను నాకించుకయు గానుపించకుండెను. కాని దైవానుగ్రహమువలన మధ్యమధ్య మెఱపులు మెఱయుచుండుటచే మెఱసినపుడెల్ల బాటనుజూచుచు రెండేసి యంగలిడుచుంటిని. ఇట్లు పది యంగలిడునప్పటికి నాకేదియో యొకశబ్ద మేర్పడినట్లుగ వినబడెను. బెదరినవానికి గుదిరినవన్నియు పిశాచములేయన్నట్లు యీశబ్దమును నేనిదివర కెన్నడును వినియుండని కారణంబునను, యేదోయొక భయంకరముగ వినుపించిన కారణంబునను, మార్గమునందు బాలుడనగు నేనొంటరిగ ప్రయాణముచేయుచుండిన కారణంబునను, గాఢాంధకారముగ నుండి వర్షముగూడ కురియుచుండిన కారణంబునను, పిడుగుబడినవానిమాడ్కి కదలక మెదలక నిశ్చేష్టుడనై కొంచెముసేపచ్చట నిలిచియుంటిని. కాని బాడివెళ్ళనను గొందరచే రైల్వేస్టేషనునకు బోవలసినవాడనైతిని. అదేమియోగాని బయలుదేరునప్పటికి గోడ్డు రెండువైపులకును చీలియుండెను. కాని పగలెప్పుడును నేనీదారిని బాగుగ గుర్తించియుండని కారణమునను, గోడ్డు చీలక యొకటిగ నేయున్నట్లు మనస్సునకు తోచినందునను మిక్కిలి యాశ్చర్యమును బొంది యెటుబోవుటకును దోచక కొంతతడవచ్చటనే కాలము వృథా బుచ్చితిని. "వరదను గొట్టుకొని పోవువానికి తెప్ప యొకటివొరకి"నట్లు నాకట్టికాలమున నేను సాధనముజేయుచున్న మనోశక్తి జ్ఞప్తికివచ్చెను. సర్వేశ్వరునికృపచే నా మనోశక్తి నట్టిసమయమున నుపయోగించిన కొంత తడవు

నకు రైలురోడ్డుమీదికెట్టులో జేరియుంటిని. అచటనుండి రైల్వేస్టేషనుజేరుటకుపల నొకవంతెన దాటవలసి యుండెను. సుమారావంతెన యేడెనిమిది గజముల వెడల్పుండుటచే దూకుట దుర్లభమని యిప్పుడు తెలియుచున్నది. నేనావంతెనవద్దకువచ్చి చూచునప్పటికెంత వెడల్పుండినదియును గనుపించకుండెనుగాని మెఱపుకాంతిచే నొకసారిమాత్రము హాటాత్తుగ మూడునాలుగు గజములున్నట్లు గనుపించెను. పిమ్మట వంతెనవద్దను నిలుచుండి సర్వేశ్వరునిపై భారముంచి మనోశక్తి నుపయోగించి యొక్కగంతువైచితిని. కంటిరా! వంతెన యొక్క వెడల్పుండినను యొక్కగంతులో నావలకి జేరవలయునని మనోశక్తినుపయోగించిన కారణమున యవలీలగనంతటి యద్భుతకార్యమును గావించియుంటిని. కావున మనసునందేదియైన దృఢముగాదలంచిన నదితప్పకజరుగునని ప్రతివారును తలంచవలసియున్నది.

చదువరులారా! మీరుగూడ నిమనోశక్తిని సంపాదించి లోకములో పెక్కుఘనకార్యములొనర్తురని మిక్కిలి నమ్మియున్నాను. మీరుప్రతిదినమును రెండునిమిషములకాలము మనోశక్తిని సంపాదింప వ్యయపెట్టలేరా! ఈరెండునిమిషముల కాలమును ప్రతివారును వృథాబుచ్చుచుండుట లేద? యిట్లు వృథాబుచ్చుటకన్న నిమనోశక్తిని సంపాదించుటకు ప్రయత్నింపరాదా! గ్రామమున కొక్కరైననుండిన మనదేశమెంతటి మహోన్నతదశ నొందియుండును. గాన సోదరులారా

యుక్తమైన మీరెల్లరు నీశక్తిని సంపాదించు విషయములో పాటుపడవలసి యున్నది.

ఆంగ్లభాషాసేవకై (1918–19) తెనాలిపురమున నుంట తటస్థించినప్పుడు నేను నివసించుగదివద్ద స్కూలునందున్న సమయములందు దక్క తదితర సమయములయందు సుమారిరువదిమందికి తక్కువ విద్యార్థులుండెడివారు కారు. వారెల్లప్పుడేదో యొక వింతయగుపనిని జేసి చూపించుడని కోరుచుండెడివారు. ప్రపంచమున స్నేహితులకన్న నెక్కువగా తోడగువారితరులు లేనికారణంబున వారికెన్నడు నే నిరాకరించి యుండలేదు. ఇట్టి ముఖ్యులగు స్నేహితులలో మ॥రా॥శ్రీ॥ కొత్త సీతారామయ్యగారును, జంపాల నారాయణమూర్తిగారును నాకు విశేషముగ పరిచయము గలిగి యుండిన కారణంబునను నాయందు మిక్కిలి స్నేహభావము గలవారైనందునను మెస్మరిజ మనేకపర్యాయములు జేయుమని కోరిన నాకది శ్రమగా నుండుననుతలంపుతో నన్నెన్నడును విశేషించి వింతకార్యములను జూపుడని కోరుచుండెడివారు కారు. అయినను వారిస్వభావమునకు నేనమిత సంతోషస్వాంతుడనై వారు కోరకుండగనే పెక్కుయాశ్చర్యపు పనులను జేసి యుత్సాహమును గలుగజేయుచుంటిని. ఏమి; యీలోకంబున స్నేహితులను సంతోషపెట్టుటకన్న నెక్కువైనది రెండవది గలదా! లేదు, లేదు. గాన చదవరులారా, మీస్నేహితులను సంతోషబెట్టుచు మీరుగూడ సంతోషకరముగ కాలముగడుప ప్రయత్నింపరాదా? యిటువంటి సంతోషమును బొందు

టకు మనోశక్తియే యని పలుమారు వక్కాణించి యుంటినిగదా.

సామాన్యముగ విద్యార్థులేదైన నొకపాఠమప్పగింపవలసివచ్చినయెడల కొంతమంది పుస్తకములను దీసికొని యాపాఠమువచ్చువరకును చదువుట మానివేయనని దృఢముగా తమ మనస్సునందనుకొనెదరు. విద్యార్థి తన మనోశక్తి నుపయోగించిన కారణమున రెండుమూడు పర్యాయములు చదువునప్పటికే బాగుగ వచ్చియుండును. మీలో కొంతమంది యొకపాఠమును పలుమారు జదివియు నప్పగించలేనివారుగ నుందురు. మరికొందరా పాఠమునే యొకమారుజదివి యప్పజెప్పగలవారుగ నుందురు. ఇదికూడను మనోశక్తిమీదనే యాధారము గొనియున్నది.

పుస్తకమును చేతబూని ప్రతివిషయమును శుభ్రముగా మరచి చదువవలసినపాఠమును చక్కగా బహుజాగ్రత్తతో నొక్కమారుచదివినయెడ పాఠమప్పగించగలశక్తిగలవాడగును. ఇచ్చట తనమనోశక్తి నుపయోగించినకారణమున పాఠము నొక్కసారికే చదివి మరలచెప్పగలుగుచున్నాడు. మరల నాపాఠమునే చదువబోవువాడు మరియొకము తనతాతసంగతియును, మామసంగతియును లేక మరియొకసంగతినిద్దియో దలచుచు పాఠమునుజదువన మొదలిడిన పదిదినములకైన వచ్చుట దుర్లభముగానుండును. గాన మనోశక్తి యొక్క మహాత్మ్యమును త్వరలో గ్రహింప ప్రయత్నింతురని నేను మిమ్ములనాదరను కోరుచున్నాను.

## పుల్లలను నడిపించుట.

ఏదైన నొకనునుపగుపుల్లనుదెచ్చి దానిచివరలయందు నీచేతులతో పట్టుకొని నీదగ్గరనున్న వానిచే రెండేసియంగుళ ముల పొడవుగలిగినటువంటి రెండుతిన్నని పుల్లలనుదెప్పించి వానిని మధ్యకువంచుమని జెప్పి పిమ్మట కుడిచేతినైపున నొక టియును, యెడమచేతినైపున నొకటియును నీవుపట్టుకున్న పుల్లమీద బెట్టించి భూమికి తగిలితగులనట్లు బెట్టియుంచుము. తరువాత నీదృష్టిని రెండుపుల్లలపై యుపయోగించి మనో శక్తితో (రెండునుకలసికొందురుగాక) యని తలంచుచున్న కొంతసేపటి కారెండును కాళ్లుగలవాటివలెవచ్చి గలసికొను టచూచి ప్రతివారు మిక్కిలి యాశ్చర్యమును బొందెదరు.

## విత్తనములేక చెట్టునుబుట్టించుట.

సాధారణముగ మేడలయందు బెట్టించు చెట్లతొట్లలో నొకదానిని సంపాదించి దానియందేమియును కల్తీలేని యిసు కను బోయించి యొకచోట బెట్టించుము. పిమ్మట నివాతొట్టిని జూచుచు "యిందుండి యొకవిచిత్రమైన చెట్టుబుట్టును". అని సుమారొక వారముదినములు నిమనోశక్తినుపయోగించుము. ఆహా యేమి యాశ్చర్యము. తొట్టిలోని మట్టియందు చిగిరిం జనైన బెట్టకుండగ దిట్టమగుపట్టుదలచే గట్టిగ నీమనో శక్తిని చెట్టుబుట్టుగాకయనుచు తొట్టినేమిముట్టకుండగ చూర బెట్టినచుట్టువారు చెట్టుజూచి పట్టరానిసంతసంబుపడక యుండు టవట్టిదియా! ఇదియంతయును మనోశక్తివల్లనే గలుగు చున్నదనుట వేరుగ జెప్పవలెనా! ఏవిధమైన విత్తనమునుగాని

వేయకయే మట్టిబోసిన తొట్టియందు చెట్టునుబుట్టించుట నీ మనోశక్తివలనగాక మరిదేనిచేత బుట్టుచున్నది? ఇదెంతటి విపరీతము! ఇట్టిశక్తిని నీయందుగలిగియున్నప్పుడు మనోశక్తియందేమియు లేదని చెప్పుచుండెడివారెంతటి తెలివితక్కువవారని చెప్పవచ్చునో చదువరులే గ్రహింతురుగాక.

మిరపకాయను తీపిగాచేయుట.

మిరపకాయ నొకదానిని తెప్పించి నీవుదానివంకజూచుచు "నీయందుకారములేదు తీపిమాత్రమున్నది" అని నీమనోశక్తినుపయోగింపుచూ యిట్లు కొంతసేపు చూచినపిమ్మట నీస్నేహితులకందరకామిరపకాయను కొంచెము కొంచెముగా పంచిపెట్టి దానిరుచి యెట్లున్నదని యడుగుము. పంచదారవలె తియ్యగా నున్నదని ప్రతివారును బల్కుదురు. నోటిలోవేసికొనిన నోరంతయును మంటబుట్టించి గంతులువేయించు మిరపకాయను నీమనోశక్తివల్ల పంచదారవలె తీపిని గలుగజేయుచున్నావే! యెంతటి యాశ్చర్యము! ఇంతకన్న వేరుగ సాక్ష్యము గావలెనా? నీమనోశక్తి కింతటిసామర్థ్యముగలదని తెలిసిన ప్రతిమానవుడును దీనిని సంపాదించుటకు ప్రయత్నింపకూరకుండడని నేనుమిక్కిలి దృఢముగ జెప్పగలను.

చేతిరుమాలును పాముగాచేయుట.

చదువరులారా! మీచేతిరుమాలను గుండ్రముగా చుట్టి పామువలె కొంచెము మెలికలుమెలికలుగా బెట్టి దానిపై మరియొక చేతిరుమాలనుగప్పి తూర్పుముఖముగా గూరుచుం

డి నీవెనుకభాగంబున నెవ్వరిని లేకుండగా నియమించి నీచేతి రుమాలతో కప్పబడియుండినది పాముగాని మరియొకటిగాద ని నీమనోశక్తినంతయు నుపయోగించుము. చూచువారంద రాశ్చర్యమంద నది పామై మెల్లగా కదలుట కారంభించును. అంత నావినోదమును చూడవచ్చినవారలలో నొకనిని పైనక ప్పినటువంటి నిచేతిరుమాలను తీయుమనికోరుము. ప్రతివారు ను తీయుటకు భయమును జెందుచుందురు. గాన నీవట్టిసమ యమున దానిని హటాత్తుగా తీసివేయుము. ఏమి యీ యా శ్చర్యము! ఇంతకుమును నీచేతిరుమాలనుగదా పామువలె చుట్టి నీరుమాలున కడుగుభాగమున నుంచినది? ఇంతలోనె నీవుచుట్టిపెట్టిన రుమాల కట్టుకొనుటకు శక్యముగాక "వట్టిగొ డ్డున కఱపులెక్కువ"యన్నట్లు దిట్టముగ బుసలుకొట్టుచు చు ట్టుపట్టుల నొకనినైన చుట్టియుండవివ్వకుండ పడగనెత్తి బహు పౌరుషముగ నాలుకను జాపుచు కఱచిచంపుదానివలె మిక్కి లి భయంకరముగ గనుపించును. ఆహా! యేమి నిమనోశక్తి యొక్కసామర్థ్యము! ఇదిచూచినవారందరు నీయొద్ద భగవ దాంశములున్నవని భ్రమించి నిన్ను మిక్కిలి గౌరవమును జేయుదురు.

## విభూతిగడ్డను పటికి బెల్లముగా మార్చుట.

నీవొక విభూతిగడ్డను చేతిలో తీసికొని నీచుట్టునున్న వారలకెల్లరకును చూపించి యిదేమిటని యడుగుము. ప్రతి వారును విభూతిగడ్డని చెప్పుదురు. పిమ్మట, సోదరులారా, మీరందరిప్పుడు పరీక్షించినటువంటి విభూతిగడ్డను పటికిబెల్ల

పుగడ్డవలె నామనోశక్తివల్ల జేయబోవుచున్నానని యెల్లర
కును జెప్పి నీవు విభూతిగడ్డవంక జూచుచు దృఢమనస్సుతో
"నాచేతియందున్నది పటికిబెల్లపుగడ్డగాక విభూతిగడ్డకాగు"
అని నీమనోశక్తి నుపయోగింపుము. అంత నెల్లరకును వింత
యగునట్లు నీచేతియందున్నది పటికిబెల్లపుగడ్డయై యుండును.
పిమ్మట దానిని పగులగొట్టి సభికులకందరకును బెట్టినయెడ
తియ్యగా పటికిబెల్లమువలె నున్నదని చెప్పుదురు. ఏమి, మన
మదియనుకొన్న యదియగుచున్నదే, ఇంతకన్న గొప్పవిష
యమెద్ది! కాన చదువరులారా, ఈ మనోశక్తికై తప్పక
మీరెల్లరును బహు శ్రద్ధతో పాటుపడవలయునని నేను మి
క్కిలి ప్రోత్సాహము జేయుటకు సాహసించుచున్నాను.

## DEVELOPMENT OF BODY.

### శరీరమును బెంచుట.

నీవు ప్రతిదినమును సూర్యోదయమునకు పూర్వము లే
చి నిత్యకృత్యములను దీర్చుకొని పిమ్మట స్నానమాచరించి
మీగృహమునందు పరిశుభ్రమగు గదిని జూచి దానియందు
సాంబ్రాణి మొదలగు సువాసనవచ్చు పొడిని నిప్పుమీదజల్లి గ
దినంతయును పొగయావరించునట్లు జేయుము. పిమ్మట నత్త
రు పన్నీరు మొదలగునవి సువాసనవచ్చునట్లు కొంచెము కొం
చెముగా గదిలో చిలకరించుము. దొరకినచో సువాసనగల
పుష్పములనుకూడ గదియందు వెదజల్లుము. తదనంతర మే
కాకివై గదిలోనికి ప్రవేశించి తలుపులుమాత్రముమూసి కిటి
కీలను తెఱచియుంచి కిటికీలగుండ నెవ్వరిని తొంగిచూడకుం

డునట్లుజేసి యుత్తరముఖముగా గాని లేక పూర్వముఖముగా గాని తిరిగి నిలుచుండి గాలిని మెల్లగా (ధ్వనిలేకుండునట్లుగ) ముక్కు రంధ్రములద్వారా బీల్చుచు నీమనసునందిట్లనుకొన వలెను. "నేనుపీల్చు గాలియందుండు మంచిశక్తిని గ్రహించుచున్నాను. నాకన్న బలవంతుడీ ప్రపంచమునందెవ్వడును లేడు నేనే మిక్కిలి యందముగలవాడను. నాశరీరము పులిసింహ గారువన్నెను మించియున్నది. నాకన్న బుద్ధిబలమునందు సుప్రసిద్ధుడితరుడు లేడు. ప్రపంచమునందెట్టివాటి కష్టతరమైన పనియైనను నావల్ల కొనసాగబడును. నాశరీరమును నా యిష్టమువచ్చినట్లు పెంచగలను. లేక మిక్కిలి చిన్నదానిని గా జేయగలను అదిగో నాకుడిచేయి యూపిరితిత్తి పెరుగుచున్నది" అని దృఢచిత్తము దలచుచుండుము. ఇటు నీచేయిని యూపిరితిత్తినని సమయము పెంచగలిగినప్పుడు నీశరీరమంతయును నీకు స్వాధీనమగును. పిమ్మట పైని చెప్పినచొప్పున గాలినిబీల్చుచు మనస్సున దీ క్రిందివిధమున దలచుచుండుము. "నాశరీరమంతయు యూపిరితిత్తి యుబ్బుచున్నది. ఇప్పుడు నాయిష్టమువచ్చిన దానికి నుబ్బుచున్నది" అని నీవనుకొనుడనే యుబ్బుటగారంభించును. అట్టిసమయమున యొక భిముఖముగ నొకయద్దమును బెట్టి నీవుబ్బుచున్నావని దానిని యందు చూచుకొనుచుండిన నీకే భయంకరముగ గానుపించును. తత్కారణమున నీవీసాధనమును జేయునప్పుడు పను గావున యద్దమునందు నీవు చూచికొనకుండగ తలుపులన్ని యును వేసి నీకు ప్రియమిత్రులగువారికిమాత్రము తెలుపుసం

దులనుండి చూచుచుండనిమ్ము. వారుగూడను నిన్నుజూచి మిక్కిలి భయమును జెందుదురు. కాని వారినట్టి సమయమున మాట్లాడవద్దని యదివరకే చెప్పియుండవలెను. ఇట్లు నీమనోశక్తి నేవిధముగ నుపయోగించి నీదేహము నేవిధముగ జూపింపవలెనని యనుకొనిన నావిధమైన రంగుగా జూపించగలుగుదువు. ఇంతటిశక్తి నీకు గలిగినయెడల నీస్నేహితుల కెట్టి మాదిరి గనుపించ నెంచిన నట్టిమాదిరి గనుపించగలవు. గాన నితరులను నీయందు భ్రమింపజేయగలుగుదువు. అందుచే ప్రతివారును నీయందిష్టముగా నుందురు. లోకహితుడవని పేరును సంపాదింపగలుగుదువు. తత్కారణమున నీవేమాటన్నను ప్రతివాడదియొక గొప్పవిలువగా నెంచి నమ్ముచుందురు. నీముక్కురంధ్రములగుండ గాలినిపీల్చి యూపిరితిత్తులం దెంతసేపు నిలుపగలవో యంతసేపుమాత్రముంచి పిమ్మట నెమ్మదిగా ముక్కురంధ్రముగుండనే వదలివేయుచుండుము. గాలిని వదలివేయునప్పుడు నీమనసున నిట్లనుకొనుము. "నేనిప్పుడు వదలుచున్నట్టిగాలి నాదేహమునందుండు చెడ్డశక్తినంతయును తీసికొనిపోవుచున్నది. మంచిశక్తిమాత్ర ముంచుచున్నది. నాశరీరమునందుగల యవయవములన్నిటిని నాకు స్వాధీనము జేసిపోవుచున్నది". ఈవిధంబుగ ప్రతిదినమీ యభ్యాసము చేయునపుడెల్ల నిశ్చలచిత్తముతో తలంచుచున్నయెడల నీదేహమంతయు మంచిశక్తిచే నిండి ప్రతి యవయవమును నీకు లొంగి చెప్పిన విధమున పని జేయుచుండును. ఇంట గెలిచి రచ్చ గెలువుమని జెప్పిన సూత్రప్రకారము మొదట నీ

దేహావయవములను లోబరుచుకొన్నగదా, యితరుల దేహావయవములను లోబరచుకొనునది? గాన నీవీయభ్యాసమును పూర్తిగజేయ నేర్చినతోడనే ప్రతివారిని నీవు వశముజేసికొన గలుగుదువు. ప్రతివారును నీకు వశ్యులైన నీకీలోకమున కష్టనుష్ఠియుండదని కరతలామలకమేగద?

ఇట్టియభ్యాసమువల్లనే గాలియందుగూడ నిరాధారముగ లేవగలవు. దానిని గురించి ముందువ్రాయబోవు గ్రంథమునందు సులభమార్గములను కొన్నింటిని గనిపెట్టి ప్రచురింపదలచియుంటిని. గాన యట్టిగ్రంథమును వ్రాయుటకు నాకు నావకాశమిచ్చెదరని తలంచుచున్నాను.

సోదరులారా! నేనురచించిన విషయము లన్నియును నిశ్చయముగ జరుగునవియేగాని లేనిపోని బూటకములుగావని మీలో ప్రతివారును సిద్ధినిబొందినపిమ్మటనయినను తలంపక మానరు. నేనీగ్రంథమునందు జూపిన సాధనములలో కొన్ని మిక్కిలి సులభముగా నగును, మరికొన్ని కొంచెము ప్రయాసతో నగును. బూటకపు మాటల నోటికివచ్చిన నెల్లను మాటలేగదాయని ... టివారిలాభంబేపాటియు నెంచకుండగ చేటుదెచ్చు గ్రంథంబులు కోటివ్రాసి ప్రతిచోటుల మాటికి ప్రచురింపుచుండ పాటుజేసి గొన్నధనము మాటలు ... గాజేయుట పాటియేనయనుచు నట్టి బూటకపుగ్రంథంబుల గొని నవారిల్లప్పుడును ఘోషమిడుచుండుట ప్రతివారికిని సర్వసామాన్యముగ దెలిసియే యున్నది.

ఇట్టిగ్రంథములవ్రాయ నందుదహరించిన వానిని జేసి కూడ నొక్కటియును గాక మిక్కిలి విసుగునుజెంది, అహో యీ గ్రంథములందు రచించినవానియం దొక్కటియును గావని ప్రతి మెస్మరిజగ్రంథమునందును మిక్కిలి యగౌరవమును జూపుచున్నారు. మఱియు చదువరులు గ్రంథమునందు రచించినవానిమార్గ సరిగా ప్రవర్తింపక వ్యతిరేకముగ ప్రవర్తించిన కారణమునను చెప్పినట్లు జరుగుటకూడ లేకయున్నది. అహో, యీ విషయము మన హిందూదేశీయులకెల్లరకు నవమానకరమైన విషయమై యున్నది. గాన బూటకముల ను కొన్నింటిని జేర్చి ధనార్జననిమిత్తమై పెక్కుండ్రకు నమ్మకము లేకుండగ జేయుచు దేశమునకు క్షీణదశను దెచ్చు గ్రంథములను వ్రాయకుండగ నూరకుండిన మేలుగా గానుపించుచున్నది.

## నీమాటలను ప్రతివారంగీకరించునట్లు జేయుట.

నీ వేదైన నీమాటలను లోకులందరిచే యొప్పుకొనునట్లు జేయనెంచిన యెడల వారిముఖములను జూచుచు "నేను జెప్పబోవునదంతయును మీరంగీకరింతురుగాక" అని దృఢముగా ననుకొనినపిమ్మట నీవు చెప్పదలచినది చెప్పుము. అప్పుడు నీవేది చెప్పిన నది యందరంగీకరింతురు. చూచితివా! నీమనో శక్తివలన ప్రతివారి నోళ్లలో బరుచుకొనగలుగుచున్నావో!

## పిల్లవానిని నిద్రపుచ్చుట.

నీ వొకపిల్లవానిని రప్పించి సౌఖ్యముగా పండుకొనునట్లు నిలుగలుగ జేయుము. తరువాత కుఱ్ఱవానికి నుబొమలమ

ధ్య జూచుచు "నీకు గాఢమైన నిద్రవచ్చుగాక" అని నీమనో
శక్తితో ననుము. ఇట్లనిన నిమిషకాలములోనె యాబాలుడు
నిద్రబోవుట జూచి ప్రతివారును నీమనోశక్తికి మెచ్చుకొందు
రు. అట్టిసమయమున మనమెన్ని కేకలువేసినను నిద్రబోవుచు
న్న కుఱ్ఱవాడు పలుకడు. మరల నిద్రబోవుచున్న బాలునివంక
జూచుచు యిదిగో సోదరులారా, యీపిల్లవానిని మీరెన్ని
కేకలువేసినను పలుకకుండెనుగదా, నేను పిలువకుండనే లే
పెదనని చెప్పి మరల నీమనోశక్తితో "నిద్రనుండి లేచెదవుగా
క" అని నీలోనీవనుకొనుము. అచ్చటనున్న వారందరా
శ్చర్యమంద కుఱ్ఱవాడు నిద్రనుండి చప్పున మేల్కొనును. అ
ప్పుడు నీవాకుఱ్ఱవానికండ్లను శుభ్రమైననీటిలో నానిన తెల్లని
గుడ్డనుముంచి తుడువుము. పిదప వాడెప్పటివలెనే తెలివిగల్గి
యాడుకొనుటకు మొదలిడును. చూచువారు మిక్కిలి యా
శ్చర్యమొందెదరు.

ఇట్టి మనోశక్తిని సంపాదించుటకై ప్రతిదినమును రెం
డు నిమిషములు యభ్యాసముచేయుట చాలును. ఇట్లు పది
దినములైన తరువాత నీకు కొంతవరకైనను శక్తివచ్చినదా
లేదాయని నీలోనీవు ప్రశ్నించుకొని పరీక్షను జేసికొనుము.

నీవొకచోట నొంటరిగా గూరుచుండి నీచుట్టుపట్ల నే
దైననొక చీమనుగాని లేక మరియొక పురుగునుగాని పోవు
చుండగ జూచి నీదృష్టిని సరిగా దానియందు నిల్పి "నీకు వె
ళ్ళుటకు శక్తిలేదు నిలువుము" అని నీమనసునందనుకొనినతో
డనే కదలమెదలక కాళ్ళులేనిదానివలె నిలుచుండును. ఇట్లు ని

లుచుండినయెడ నీకు కొంచెము శక్తిగలిగినట్లును లేనియెడల యింకను రెండుమూడుదినంబు లభ్యాసము (practice) చే యవలసియున్నదని యెఱింగి మిక్కిలి పట్టుదలతో జేయుచుండుము. అంత నీకీమనోశక్తి బాగుగ పట్టుబడును. చీమ, దోమ మొదలగునవి నీమనోశక్తివలన యాగుచుండినయెడ నీకు మిక్కిలి సంతోషముగల్గి పట్టుదలతో యభ్యసించుట కలవాటు పడుదువు. తత్కారణమున పెద్దశక్తిగలుగువరకును సాధనము చేయగలవాడవగుదువు. అట్టిమహాశక్తిని సంపాదించినపుడు నీకీలోకంబున గలుగు సుఖమింతని చెప్పనెవ్వరితరము.

## స్నేహితుని పిలువకుండ రప్పించుట.

నీవొక స్నేహితునితో మాటలాడ నుత్సహించుచున్నావనుకొందుము. దైవవశాత్తు వాడు నీకు సమీపమందు లేడనుకొనుము. వానితో నిపట్టిసమయమున మాటలాడ నెంచినయెడల నీవాతనికి పంపనెంచిన సమాచారమును మనిషిద్వారాగాని, పోస్టుద్వారాగాని, తంతిమూలముగాగాని పంపవలయునేగాని మఱియొకవిధములేదని ప్రతివారును చెప్పుదురు. కాని మనోశక్తి కలిగియుండిన యెడల నీవాతని కేవిధమైన యుత్తరముగాని తంతిగాని పంపకయే రప్పింపగలుగుదువు. ఎట్లన, నేకాంతముగ నేదియొకస్థలమునకు వెళ్ళి నీస్నేహితు డేవైపుననున్నాడని యెంచునో యాముఖముగ కూర్చుండి కన్నులనుమూసికొని యాతని యాకారమును నీమనసునందు చూచుచు "మిత్రమా నీతో కొన్ని మాటలు మాటలాడవలసి యున్నదిగాన నాయందు దయయుంచి తప్పక బయలుదేరి

రమ్ము" అని నీమనసునందు మిక్కిలి నమ్మకముగా దలంచుచుండుము. ఇట్లు సుమారు రెండుమూడురోజులు ప్రతిదినమును ప్రాతఃకాలమున పదినిమిషములు నీమనోశక్తి నాతనిపై నుపయోగించుము. తదనంతరము నీమిత్రుడు నిన్నుజూచి మాటలాడుటకై మీగ్రామమునకు తప్పక వచ్చును. ఇదియే కొన్నిదినములు మిక్కిలి పట్టుదలతో యభ్యాసము జేయవలెను. ఇట్టి మనోశక్తిని మీగ్రామమునందున్న స్నేహితునిమీద నుపయోగించిన కొన్ని ఘంటలకాలములోనే వాడు నీవద్దకు వచ్చును.

## ప్రతివారిని స్నేహితునిగా జేసికొనుట.

ఇట్లు నీకు మనోశక్తి బాగుగ సంప్రాప్తించిన దనే "నాకు ప్రతివారును స్నేహితులు. విరోధి యొక్కడును లేడు" అని ప్రతిదినమును నిద్ర లేవగనే యనుకొనుచుండుము. నిత్యే మీవిధముగ తప్పకుండగ దలంచుచుండిన లోకమునందుగల నిన్నుజూచినవారందరును ప్రాణమిత్రులగుదురు. ప్రతివారికిని నీయందు ప్రేమ బొడముచుండును. కొన్ని సమయములయందు నీయొక్క గొప్పనుజూచి యోర్వలేనివారుసైతము నిన్నుజూచినంతనే వశ్యులగుదురు. కంటిరా! ఉదారతయును మనోశక్తివల్లనే గలుగుచున్నది. ఇట్టి మనోశక్తివలన కొన్ని కొన్ని జబ్బులనుగూడ పోగొట్టగలవాడవగుదువు.

## తలనొప్పిని పోగొట్టుట.

నీవు నీస్నేహితులతో కలసియున్నప్పుడు వారిలో నొకరికి తలనొప్పి వచ్చినదనుకొనుము. అప్పుడు వాని తలనొప్పిని

పోగొట్టి వానిని సంతోషము జెందునట్లు చేయగలుగుదువు. నీ స్నేహితుడు తలనొప్పిచే బాధపడుచుండగ యాతనిని బాధనుండి నీమనోశక్తివల్ల తొలగించి సంతోషమును గలుగజేయుటకన్న నీకెక్కువ ప్రీతికరమైనదెద్ది ? ఇట్లనేకమారులు నాస్నేహితులు బాధపడుచుండగ నేను పలుమారు సులభముగా బాగుజేసియుంటిని. ఒకనాటిసమయమున నాకు మిత్రుడగు కొసరాజు లక్ష్మయ్య తలనొప్పిచే బాధపడుచున్న సమయమున నేనాతని గదికి వెళ్ళుట తటస్థమాయెను. అందువల్ల నేనాతని తలభారమును సులభముగా దీసివేసి సంతోషపెట్టగలిగియుంటిని. నేను తెనాలిపురమున నున్నప్పుడు చాలమందికి బాగుజేసియుంటిని గాని వారినందర నిచ్చటుదహరించు టనవసరముగా నెంచి వ్రాయుట మానినాడను. తలనొప్పిచే బాధపడుచున్నవానిని నీకెదురుగా గూరుచుండబెట్టి యాతని కనుబొమలమధ్య జూచుచు “ నీతలనొప్పి తగ్గిపోవును,” అనిదృఢముగా మనసునందు తలంచుచు ముఖముపై చల్లగానూదుచు తగ్గినదాయని మధ్యమధ్య నడుగుచుండుము. ఇట్లుజేసిన సుమారైదారు నిమిషములకంతయు తలనొప్పిపోయి మిక్కిలి సంతోషముగానుండును. ఇట్లే పార్శ్వపునొప్పులను పోగొట్టవలసివచ్చినయెడ కణతలను జూచుచు పైవిధముగ నీమనోశక్తి నుపయోగించుము.

## బెల్లమును పేడగా జేయుట.

నీవొకనితో బెల్లము నందరుజూచుచుండగనే దెప్పించి నీచేతనుంచుకొని దానియందు నిమనోశక్తి నుపయోగించుము.

"ఓ బెల్లమా నీయందు తీపిలేదు. నిన్ను వర్తైన నోటిలో వేసికొన్న పేడవలె నుండుముగాక" అని నీలో నీవు కొంతసేపు తలంచి, పిమ్మట నీవద్దనున్న వారికి కొంచెముకొంచెముగా బెట్టుము. అహో, యిదేమి యాశ్చర్యము. బెల్లమును నోటిలో వేసికొనగా పేడవలెనున్నదని యందరాశ్చర్యమొందెదరు. ఆహా, బెల్లమును పేడగను పేడను బెల్లముగను మార్చుటెంతవిపరీతము! పూర్వము భీమకవిని బ్రాహ్మణులు భోజనపంక్తికి రానివ్వని కారణంబున కోపమునుజెంది, అప్పాలెల్లను కప్పలుగావలెననియును, అన్నమెల్ల సున్నముగావలెననియును, అయ్యాలెల్ల కొయ్యలుగావలెననియును పలికినమాత్రమున ప్రతిదియు నట్లే మారెనని చెప్పు వాడుక పిన్నపెద్ద లందరకును దెలిసినవిషయమై యున్నది. ఈమాటలు విన్నప్పుడు కొందరజ్ఞానులు సర్వాబద్ధమనియును, వేడుకార్థమై దీని నెవ్వరో గల్పించిరనియును బల్కుచుందురు గాని యట్టిమూర్ఖులు నీవీ బెల్లమును పేడగమార్చుట చూచినప్పుడైన నిజమని తలంపరా? "కఠినచిత్తమెపుడు కరగింపగారాదు" అని చెప్పినప్రకారము కొంతమందిమూఢు లప్పటికిని నీవేదో గారడీచేయుచున్నావని నమ్మకుండుటగూడ నొకానొకసమయమున తటస్థించును. అట్లు నమ్మనివానిని యతనిచేతనే బెల్లమును తెప్పించి యాతనిచేతనే యుంచుకొమ్మనిచెప్పి నీమనోశక్తి నాబెల్లముపై పైనుదహరించిన విధమున నుపయోగించుము. తదనంతరము నీకా బెల్లము పేడగామారినదని తోచినప్పుడు తినుమనిచెప్పుము. అహో యతనియవస్థ నేమనిచెప్పుదును. నోరంతయును

మురిగినపేడవలె కంపుగొట్టుచు బహు యసహ్యాకరముగనుం డును. కాన యాతనికిట్లు పైనవచించినమాడ్కి ప్రాయశ్చిత్త మునుజేసి పంపినయెడల వానికి నమ్మకము గల్గును. ఇట్లు నే ననేకపర్యాయములు పెక్కుమూర్ఖులకు ప్రాయశ్చిత్తములు జేసియుంటిని. కాని వారిపేరిచ్చట యుదహరించుట భావ్యము గాదని మానివేసితిని. ఇటువంటి వినోదములను పెక్కింటిని నేను తెనాలిపురమునఁగున్నప్పుడు నామిత్రులకందరకును ప లుమారు చూపించుచుంటిని.

## చేతిలోని చీట్లపేకముక్కను చేతిలోనె మార్చుట.

చీట్లపేక నొకదానినిదెప్పించి బాగుగ గలిపించి చూ డవచ్చినవారిలో నొకనిని ముక్కను దీసికొనుమనిచెప్పి యం దరకును చూపింపుమనుము. నీవుగూడను చూడుము. పిమ్మట సోదరులారా, యీముక్కను మీరును నేనునుగూడ చూచి యేయున్నాముగదా. దీనిని బహుజాగ్రత్తగ మీలో నొకని యొద్ద దాచియుంచుమని యడుగుము. తరువాత నీలో నీవు మనసునం దీక్రిందివిధముగ ననుకొనుము. "ఇప్పుడాతనియొద్ద దాచియుంచినది కళావరు జాకియేయని పలువురుజూచియున్న ను చూచినముక్కమాత్రముగాక మరొకటి కావలెనని దృఢ ముగ దలంచుచుండుము. ఆహా, యేమి నీమనోశక్తియొక్క ప్ర భావము! ప్రతివారికిని కనులను కప్పుచున్నదే! ఈ వింతను జూచిన యెట్టిమానవుడైనను మనోశక్తిని నమ్మకుండునా? అ ప్పటికిని నమ్మకుండిన నేను పైనవ్రాసిన ప్రాయశ్చిత్తమును జే సి బంపుచుండుము. అప్పటికి గానివానికి నమ్మకముబుట్టదు.

## దీపము నార్పుట, కాంతి తగ్గించుట.

మన గృహములయందు సామాన్యముగ నుపయోగించు దీపము నొకదానిని మనకెదురుగా మనకొక గజముగున్న ర దూరమున బెట్టించి దానివంక సరియైన దృష్టితో చూచుచు నీమనసునందిట్లనుకొనుము. "నీకిక వెలుగుటకు శక్తిలేదు, వత్తిద్వారా నూనె యెక్కదు" అని నీవనుకొనినతోడనే దీపము కళాహీనమై యారిపోవుటకు సిద్ధముగ నుండును. ఇంకను నీమనోశక్తి నుపయోగించిన బొత్తిగా నారిపోవును. అట్లారిపోవుటకు ముందు నీమనోశక్తిని మరల దీపముపై కాంతిగా వెలుగుటకై యుపయోగించుము. తరువాత దీపమెప్పటివలె వెలుగుట కారంభించును.

## నిద్రను బోగొట్టుట

మీగ్రామమునం దెవ్వనికైన నిద్రాదేవతబట్టి బాధించుచుండిన పాపమాతని కెన్నివిధములో నష్టములు గలుగుచుండును కాన నీవట్టివానియందు దయగలవాడవై నిద్రాదేవతబారినుండి తప్పింప ప్రయత్నింపుము. అట్లు పరపీడలను పోగొట్టుచుండిన నీకు మిక్కలి శ్రేయస్కరము. కాన నీవతని యెదురుగా రెండడుగుల దూరమునందు గూర్చుండబెట్టుము. పిమ్మట వాని కనుబొమలమధ్యజూచుచు (సిద్దృష్టి నుపయోగించుచు) మనోశక్తితో "నీకు నిద్రాదేవతబాధతొలగిపోవును. రేపటినుండి మావలెనే చురుకుగానుందువు. నికీదేవతబాధ వదలుటకొరకే నాకడకు తీసికొని రాబడినావు" అని యనిన

వెంటనే యాతనికా నిద్రబాధ కొంత తొలగిపోవును. ఇట్లే మరునాఁడుకూడను నీమనోశక్తి నాతనిపై పైనుదహరించిన విధమున నుపయోగించినయెడల నాతని నిద్రబాధ తొలగిపోవును. ఇట్టి మేలులను ప్రపంచమునందు నీవనయము శేయుచుండుటకు ప్రయత్నింపుము. అందులకై సర్వేశ్వరుఁడు నీకింకను గొంతశక్తినీయ నుత్సాహమును జెందుచుండును.

## ఇసుకను పురుగులుగా మార్చుట.

నీవు కొంత యిసుకను దెప్పించి దానిని ప్రతివారికిని జూపింపుము. చూచినవారందరదిచూచి యిసుకని బల్కుదురు. తదనంతరము నీవా యిసుకను జూచుచు "నీకు నీటిమీద తేలగలశక్తిని నేనిచ్చుచున్నాను. నీటిమీద తేలి పురుగులాడినట్లుగ నాఁడుదు" అని నీమనోశక్తి నుపయోగించి పిమ్మటా యిసుకను చెఱువునందు గాని లేక భావియందుగాని జల్లుము. పురుగులవలె ననేకచిత్రములుగ భావియందమితముగ జేరి చూచుటకసహ్యాకరముగ భావినీటియందు గందరగోళమును జేయుచుండును. ఇదిచూచి ప్రతివారు మిక్కిలి వింతనొందుచుందురు. అట్టి సమయమున నీమనోశక్తిని భావియందుచూచుచు పురుగు లెక్కువయగున ట్లుపయోగించుము. చూచువారింకను మిక్కిలి యాశ్చర్యమొంద పురుగు లెక్కువగుచుండును. ఇట్టివినోదములుజేయుచు నీవేగ్రామమునకుగాని పట్టణమునకుగాని వెళ్లిన నచ్చటనే చాలమంది స్నేహితులను సంపాదింపగల్గుదువు. ఇటువంటి వింతకార్యములను నాస్నేహితుల కెల్లరకును పలుమారు చూపియుంటిని.

## బెణుకులను పోగొట్టుట.

నీస్నేహితుల కెవరికైన చేయియో లేక మెడయో బెణికినదని వచ్చినవెంటనే యతనిని నిలుచుండబెట్టిగాని లేక కూరుచుండబెట్టిగాని యా బెణికిన స్థలమును జూచుచు "నీకు బెణికిన స్థలమునందు బాధతగ్గిపోవును. చెదిరిననరము మరల యథాస్థానమునకు వచ్చుచున్నది" అని నీమనమునందు దృఢముగ నీచిత్తశక్తిచే తలంచిన పిమ్మట నీస్నేహితుని బాధ సులభముగ పోవును.

నామిత్రుడగు వెంపటి సూర్యనారాయణ వామనేత్రము భయంకరంబుగ నెఱ్ఱబారి నిమిషకాలమైనను పుస్తకమును చదువనియ్యకుండెను. అట్టి సమయమున నేనాయన బాధనుజూచి నామనోశక్తిని సుమారు మూడునాలుగు నిమిషములుపయోగించితిని. మరునాటికాయన నేత్రము యెఱుపు, నొప్పు, బాధ మొదలయిన వేమియు లేక శుభ్రముగా నుండినందున సంతోషముగ నాయన నాగదికివచ్చి యాంతని సంతోషమును నాయెడజూపి నన్ను మెస్మరిజమును నేర్చుకొను విధానములడిగి తెలిసికొని యాయనగూడ యభ్యాసము జేయ మొదలిడెను.

తెనాలిపురమునం దాంగ్లభాషాభ్యాసముచేయుచున్నప్పుడునాతో సిత్యమును సుమారిరువదిమందికి తక్కువయుండెడివారుకారు. వీరిలో నందరును సామాన్యముగ మెస్మరిజముచేయ నభ్యాసము ప్రతిదినమును నాతో ప్రోత్సాహమును జేయబడుచుండిరి. నేను జేయు వింతలను ప్రతిదినమును జూచుటకై

వీరందరును స్కూలు విడచినతోడనే నాగదివద్ద హాజరుగా నుండెడివారు. ఇట్లుండ నొకనాటిసమయమున నామిత్రబృందములో నొకడగు చల్లా గోపాలరావుగారితో నెవరోయొక విద్యార్థి మెస్మరిజమనిన నెంతమాత్రమును నమ్మకములేదని పలుమారాతనితో పలుకుచున్నాడనియును తత్కారణమున నాతనికెద్దియో నిదర్శనము ప్రత్యక్షముగ జూపించవలెననియును నన్నుకోరగా నేదియో నొకటిజేయ మొదలిడుచుండ నచ్చటనున్న మరికొందరు మిత్రులతని నేడ్చునట్లు జేయుడని కోరగా నతనికి జేసినచో నతనికేమియును దెలియదని యాతనిసోదరుడేడ్చునట్లు జేసియుంటిని. పిమ్మట మరికొన్ని వినోదములనుజేసి యాతనికి మెస్మరిజమునందు మిక్కిలి నమ్మకమును గలుగజేసియుంటిని.

## విభూతియొక్క గొప్పశక్తి.

సాధారణముగ భూతవైద్యులందరును విభూతిని వాడుచుండుట ప్రతివారును చూచుచునేయున్నారు. మన ముపయోగించునటువంటిశక్తి విభూతిలో త్వరగా ప్రవేశించి రోగియొక్క దేహమును తాకినవెంటనే యామంచిశక్తి యందులో ప్రవేశించి యాతని చెడుశక్తిని వెళ్లగొట్టును. మరియు విభూతిని కనుబొమలకుమధ్య బెట్టుచు మరికొంతభాగమును లోపలకుగూడ పంపుచుండుట పలుమారు చూచుచున్నాము. దీనికి కారణంబేమియన ముఖమునందు శక్తిని త్వరలో గ్రహించు నరములున్నవని మనపూర్వీకులు గ్రహించియుండుటచే విభూతి నచ్చట బొట్టుగానుపయోగించిన మనమావిభూ

తియందు ప్రవేశింపజేసిన శక్తి ముఖనరములద్వారా దేహమునందు ప్రవేశించి రోగిని త్వరలో స్వస్థతగావించుచున్నది. మరియు నోటిలో వేసికొని తినిన యెడల గర్భమునందాహారముతో గలసి రక్తముగామారి దేహమునందెల్ల భాగములకును మనముపయోగించిన శక్తి ప్రవేశించి రోగమును కుదుర్చుచున్నది. భూతవైద్యులు విభూతినితీసికొని మంత్రించి యిచ్చుదురు. ఆవిభూతిని మంత్రించునప్పుడు దానియందర్థమిది: "భూతపిశాచములచేగాని జడిసినందువలనగాని ప్రవేశించిన చెడుశక్తి నీయందుండి తొలగిపోవుగాక. నేటినుండి నీవారోగ్యముగా నుందువుగాక" అని భూతవైద్యునియొక్క మనోశక్తి నుపయోగించి యిచ్చును. ఇట్లే నాశక్తిని విభూతియందు ప్రవేశింపజేసి పలువురను నిద్రబారినుండియు, సోమరితనమునుండియు, తలనొప్పినుండియు తొలంగించియుంటిని.

దూరముననున్నవారేమిచేయునదియును జెప్పుట.

నీవు ప్రతిదినమును నిద్రనుండి లేచినతోడనే తూర్పు ముఖముగా గూరుచుండి నీమనసునందేమియు తలంచకుండ (Thoughtless) గా కొంచెముసేపనగా సుమారు రెండు నిమిషములకాలముండుము. ప్రతిదినమిట్లు వాడుకచేయుచున్న సుమారొక నెలదినంబులకు నీమనసునకొక శక్తి గలుగును. ఈ యభ్యాసమును చేయుటకు మొదట నీకు మిక్కిలి స్నేహము గలవానిని సమీపముననున్న గదిలోనికిబంపి యెద్దియో నొకచేతిలోవస్తువు నొకదానిని పెట్టుకొనుమని చెప్పుము. తదనంతరము నిశ్చలచిత్తముతో నీవు కొంచెముసేపూరకుండి

ఏమిత్రుడు నావస్తువు నీచేతిలో బెట్టుకొనెనని ప్రశ్నించుకొనును. తక్షణమే నీమనస్సునకొక చేయి తోచును. పిమ్మట నీస్నేహితుని బిలిచి మిత్రమా! నిన్న ఫలానిచేతిలో నావస్తువును బెట్టుకున్నావని చెప్పుము. ఇట్లు నీవు చెప్పినయెడ నీస్నేహితుడు ఆశ్చర్యభూతముగా నిన్ను మెచ్చుకొనును. కొన్ని సమయములయందు తప్పిపోవుటయుగూడ సంభవించును. కాని దినసాధనమువల్ల కొన్నినాళ్ళకు సరిగా జెప్పగలుగుదువు. ఈవిధముగా నెమ్ముక వశక్తిని సంపాదించిన పిమ్మట దూరమునందున్న బంధుమిత్రుల యొక్క క్షేమసమాచారములను, వారు తత్కాలమున జేయు పనులను సైతము జెప్పగలవు. ఇట్లు విశేషించి మనోవశక్తిని సంపాదించిన కారణముననే భూతభవిష్యద్వర్తమానము మన ఋషులెల్లరును చెప్పగలిగియున్నారు. కంటిరా! మనోవాహనశక్తి క్షీణించిన కారణమున మనదేశమునందిప్పుడట్టి శక్తిని గలవారరుదుగా నుండుట తటస్థించినది. వేయేల, ఇకనైన విశేషించి ఇటువంటి గొప్పశక్తిని సంపాదించుటకు ప్రయత్నింతురని మిక్కిలి నమ్ముచున్నాను. ఇట్టిసాధకను జేయు ప్రతిమానవుడును దేవునిసృష్టియందు జన్మించిన ప్రాణికోటులయెడ దయాగుణము జాలిగలవాడై "అహింసాపరమోధర్మః" అను పెద్దల వాక్యము ననుసరించి ప్రవర్తించుచుండవలయును. సాధ్యమైనంతవరకు ప్రపంచమునందెట్టి ప్రాణికిని కష్టమును గలుగజేయకుండ నిజముగా నీవేదినమునను జీవహింస చేయుచుండుటలేదని నీ మనస్సాక్షిగా నమ్ముచుండిన చాలును. నీమనస్సునందు దేశకాలములను లేకుండగ కాలమును గడుపుచుం

డిన నిశ్చయముగా నీవ్రేకవిధమైన ధైర్యముగ్గి చూచుటకెల్ల రకును మిక్కిలి సంతోషముగా నగుపడుచుందువు. ఇంతక న్న నీకెక్కుడుభాగ్య మెయ్యది? నీస్నేహితులలో నెవరికైన కొంచెము జబ్బుగానుండినగాని లేదా యేదైన కష్టములందు చిక్కియుండినగాని యాతడు దూరముననున్నను నీమనస్సెంత యు కలవరపడుచు నేమియు దోచకుండుట పలుమారు మన మందరమును చూచుచునేయున్నాము. కంటిరా! మన మ నోశక్తికై పాటుపడకుండనున్నప్పుడే దూరముననున్న మన స్నేహితునకెద్దియో కష్టము సంప్రాప్తించిన దైవమహిమచే యాతనికి కష్టకాలము సంప్రాప్తమాయెనని మన కేదియో యొకవిధంబుగ తెలియుచున్నప్పుడు మనోశక్తికై విశేషము గా పాటుపడ సంపాదించినపిమ్మట యోగక్షేమములను కను గొనలేకయుండెదమని చెప్ప నెవ్వరైన సాహసింపగలరా?

సామాన్యముగ మనము భోజనము చేయుచున్నప్పుడు గాని లేక కాఫీ మొదలగునవి త్రాగునప్పుడుగాని మనలో నె ల్లరకును పలుమారు కొరమారుచుండుట చూచుచునే యు న్నాము. అట్టిసమయమున బంధుమిత్రులలో నెవ్వరో కొంత మంది మనలనుగురించి యనుకొనుచున్నారని మనపెద్దలంద రును జెప్పుచుండుట పలుమారు వినియున్నాము. ఇదియును విచారింప వాస్తవముగ మనోశక్తివల్లనే గలుగుచున్నది. ఈ విషయమునుగురించి యనేకపర్యాయములు నేనును నా మి త్రులును గలసి పరీక్షించియుంటిమి. ఇందు కెన్నడును మాకు పొరపాటు వచ్చియుండలేదు. గాన చదువరులారా! మీా రీ

విషయమునుగురించి బాగుగ విమర్శించి చూచిన మీకుగూడ నట్లేగానుపించినపుడైనయనుకొనక మానరనితలంచుచున్నాను.

ఈ మనోశక్తిని సంపాదించుటకు ప్రతిదినమును సూర్యోదయమునకు పూర్వమే లేచి నిత్యకృత్యములనుసల్పి పిమ్మట స్నానమాచరించవలెను. ప్రవహించుచున్న కృష్ణ, గోదావరి, గంగ, సింధునదులలోగాని, వాటి యుపనదులలోగాని లేక నట్టి యుపనదులనుండి త్రవ్వబడిన కాలువలలోగాని లేక నెటువంటి పారుడునీటియందుగాని స్నానముచేయుట మిక్కిలి శ్రేయస్కరము. *పారుడునీటియందొక శక్తియున్నది. మన పూర్వీకులు జ్ఞానాధిక్యము గలవారు గనుకనే యెల్లనదులను మిక్కిలి పూజనీయముగానెంచి యేటేట నదీదేవతలకు మ్రొక్కునట్లేర్పాటు జేసియుండిరి. కాని యేబావికిని మ్రొక్కునట్లేర్పాటుజేసియుండలేదని హిందూజాతికంతకును విశదమైయున్నది. కాన నదీజలమునందు జలకమాడుట చాలమంచిదని నాయభిప్రాయము. కదలికలేక చెడువస్తువులెల్లను క్రుళ్ళి వేలకొలది పురుగులు నీటియందంతయును మనకనులకు గానరానంత చిన్నవిగా నావరించి చూచుటకుమాత్రము బాగుగనున్నను కదలికలేని నీటియందు జలకమాడుట మంచిదిగాదని ప్రపంచజ్ఞానముగలవారందరకును తెలియును. అహో, కొన్నికొన్నిగ్రామములకు కాల్వల వసతులుగాని లేక రెండవ పక్షమున బావులవసతులుగాని లేని హేతువుచే చెఱువులయందునీటిని వాడుకొనువారి సౌఖ్యమేమని చెప్పవచ్చునో చదువరులే గ్రహింతురుగాక.

పానయోగ్యమగు నీటిని దెచ్చుకొనుటకై ప్రత్యేకముగ, నొక చెఱువుండినను దాని విషయమై చెప్పవలసిన దేదిగా లేదుగాని త్రాగుటకు తెచ్చుకొను తటాకము నందే బట్టలనుతుకుటయు, స్నానముచేయుటయు, పశువుల కడుగుటయు, వలలువేసి చేపలన బట్టుకొనుటయు మొదలగు దురాచారములు గలిగిన గ్రామారోగ్యమునుగురించి చెప్పనక్కరలేదు. చిన్నయన్నమంతయును వెలికివచ్చుటకు ప్రయత్నించుచుండునుగదా! కాన చదువరులారా! మీగ్రామమునందిటువంటి యలవాటులుండినచో వాటిని లేకుండజేయ ప్రయత్నింపుడు. లేక యటువంటి చెఱువులకు ప్రక్కలనే బావులను త్రవ్వించి యందునుండి యూరుచుండెడి జలమును పానయోగ్యముగ నుపయోగించిన మరికొంతవరకు బాగుండును. మీగ్రామమునందు నీమాటవినరని నీకు భయముండినచో మనోశక్తి సంపాదించి వారికందరకును నిప్పుజెప్పు హితోపదేశములను సరిగా నుండి వినునట్లు జేయుము. తద్వారా నీవనేకమందికి మేలొనర్చినవాడవగుదువు.

స్నానములు మొదలైనవి జేయు మురికి చెఱువులయందు నీటిని త్రాగుటకుగూడ నుపయోగించెడు గ్రామములయందు నివసించువారెల్లరును సామాన్యముగ నెద్దియో నొక రోగముచే నిరంతరము బాధపడుచుండుట నిశ్చయము. ఇటువంటి గ్రామములను పెక్కింటిని నేను చూచియున్నాను. నేను చెప్పినట్లుగనే సామాన్యముగ ప్రతివారును యెద్దియో నొక రోగముచే బాధపడుచుండుటయు గలదు. చదువరులా

రా! మనోశక్తిని సంపాదించుటకు వాడుకచేయునపుడు శత విధముల పారుచున్నీటియందు జలకమాడుట శ్రేష్ఠము. రెండవ పక్షమున కూపజలముగూడ తగినవసతులున్న యొకవిధమున మంచిదనియే నాయభిప్రాయము. ఇట్లు నీవు స్నానమాచరించునపుడు జలమునందుండు మహాశక్తి నీలో ప్రవేశించుచున్నదనియును, తత్కారణమున నీశరీరమంతయు పదారువన్నె బంగారువలె మెఱయుచున్నదనియును దలంచుచు నీకెన్నడును దేహాన్యాధి గలుగదనియును మిక్కిలి దృఢముగ నమ్ముచు సాధనము చేయుచుండుము. స్నానము జేయునపుడు ప్రతియవయవమును శుభ్రముగా తోముకొనుచు సుమారొక యరగంట కాలమువరకు జలకమాడుట ముగింపవలెను. ప్రతిదినమిట్లు చేయుచుండిన శరీరమంతయు బంగారుచొక్కాను తొడిగికొన్నట్లు తళతళమెఱయుచు బుద్ధిబలము పెంపొంది యంగబలమునందును మిక్కిలి వృద్ధిబొందినవాడవై చూచువారల కెల్లరకును కన్నులపండువుగ నుండునట్లు గాన్పించుచుందువు. ప్రతిదినమును పైనవచించిన విధమున స్నానమాచరించుచు మనోశక్తికై యభ్యాసము చేయవలెను. అట్లుచేసినవారు త్వరలో మహాశక్తిని పడయుదురని నేను నొక్కి వక్కాణింపగలను. దొంగలు నీవెంటబడి కొట్టవచ్చినప్పుడు నీకడ్డమువచ్చిన పెద్ద కాలువలను సయితము దూకగలుగుచున్నావు కారణమెద్దియన దొంగలు వెంటపడి తగిలివచ్చునప్పుడు నీవు పారిపోవుచుండగనే కాలువవద్దకుపడినను దూకగలవను ధైర్యముచే యవలీలగ దూకుచున్నావు. కాబట్టి యిచ్చట నీమనోశక్తిని యు

పయోగించియుంటివి. అందువలన దూకగలిగియున్నావు.

నేనొకనాటి సమయమున నాప్రాణమిత్రుడగు కొత్త సీతారామయ్యగారితో జాగర్లమూడిగ్రామమువరకు సాయంతనమున మాటలాడుచువెళ్ళి మరల సూర్యాస్తమయమగు సమయమున బయలుదేరి కరీమ్‌సాహేబు అనువాని గుఱ్ఱపుబండిలో నెక్కి వచ్చుచుండగ మార్గమునందొక త్రాచుపాము కాలవశమున బండివాని కంటబడెను. పిమ్మట వాడు భీతినిజెంది బాడినాపి నాకాకృష్ణసర్పమును జూపించెను. ఇట్లుండ మఱికొంతమంది ప్రయాణీకులు గుమిగూడి పాము పడగవిప్పియాడుచుండుటచూచి మిక్కిలి భయమును జెందుచుండిరి. అట్టిసమయమున నేనుబండినుండిదిగి చల్లగా పామును సమీపించితిని. అచ్చటనున్నవారందరు నన్ను బోనలదని యఱచుచుండిరి. వారిట్లఱచుచున్న సమయమున నాశక్తి నాపాముపై యుపయోగించితిని. అచ్చటనున్నవారందరును వింతజెందునట్లుగ పామాడక పడగనుమూసికొని చల్లగా భూమిపై పరుండెను. పిమ్మట నేను పామును సమీపించి కొంచెముసేపు దువ్వి యాడించియుంటిని. చూడవచ్చినవారిలో నొకడు నావెనుకభాగముగవచ్చి మద్దుకఱ్ఱతో నొక్కదెబ్బను చచ్చునట్లుగ బాది యంగలకుపరునకు సమీపమునయున్న కాల్వలో బడవైచెను. ఇట్లే నేననేకపర్యాయములు పాములనాడించి జనులందర కాశ్చర్యమును పలుమారు గావించియుంటిని. చదువరులారా! మీరుగూడ మనోశక్తియను మెస్మరిజమును నేర్చుకొని జనులకు మేలుజేయుటకై పాటుపడుచుందుడు.

ఈమనోశక్తికై మీరుత్సాహముతో యభ్యాసము జేసినచో తేళ్ళు మొదలగువానిచే గలుగు బాధలను సుమారైదారునిమి షములలో నివర్తిజేయగలవారగుదురు.

## రాయిని మిక్కిలి సుందరముగల పిట్టనుజేయుట.

నీచేతిరుమాలును తీసికొని నీచేతులలో విదలించుము. పిమ్మట యొకరాయిని భూమిపైపెట్టి దానిపై నీచేతిరుమాలు ను కప్పుము. తరువాత నీమనోశక్తిని రాయిపై యీక్రిందివిధ మున నుపయోగించుము. "నేనీరాయిని పిట్టవలెజేసి ప్రతివా రికిని చూపించగలను. ఈరాయి నిశ్చయముగా పిట్టయగును. చూచుటకు మిక్కిలి ముద్దును గలిగించుచుండును. విశేష దూర మెగిరిపోలేదు" అని నీమనోశక్తి పావుగంటసేపు పుప యోగించిన రాయిబోయి పిట్టగానుండి బహువింతగా యర చుచు కొంచెముకొంచెముగా యెగురుచుండుట కలవాటు జే యునట్లు నటించును. పట్టుకొనినచో ప్రాణములుబోవునను భీతిచొప్పున దాని నెవ్వరంటుకొనుటకైన సాహసింపరు. ఇట్టి విచిత్రములగు పనుల నెన్నింటినో జేసి నామిత్రులను ప లుమారు సంతోషపెట్టియుంటిని.

## ముఖ్యాంశములు.

---

ఇంతటిమహిమగలిగిన మనోశక్తిని సంపాదించుటకు వాడుకచేయుచున్నంతకాలము సంసారసుఖములను గోరినయె

డల సంప్రాప్తించుట చాల యాలస్యమగును. అదియునుగాక మెస్మెరిజమునందా సక్తియును తగ్గిపోవును. ఇందుకతన దీనిని యభ్యాసము చేయుచున్నంతకాలమైనను సుఖమును గోరకుండుటయే యుత్తమము. అభ్యాసము చేయుచున్న దినములలో విశేషించి యితరులతో మాటలాడుట తగ్గించవలెను. "ముఖ్యమైన విషయములను గురించి మాటలాడుచుండుము. సాధ్యమైనంతవరకు నొంటరిగ ప్రయాణము జేయుచుండుము. అట్లు వీలులేనిచో ప్రాణమిత్రులతో మాత్రము షికారునకు వెళ్ళుచుండుము. మీ గ్రామమునకుగాని పట్టణమునకుగాని నీకేదిక్కునకు వెళ్ళుటకిష్టముండునో యాదిక్కునకే షికారునకు వెళ్ళుచుండుము. ఒంటరిగాబోవుచున్నప్పుడు మెల్లగా గాలినిపీల్చి నిలుపగలిగినంతసేపు నిల్పి మెల్లగా బయటకు విడిచిపెట్టుము. నడచునప్పుడు వేయగలిగినంత యడుగ వేయుచుండుము. నడచునప్పుడు నీవెన్నడును సంగీతము పాడకుము. నడుమును వంచి నడువకుము." పైన జెప్పినవిధమున కొంతదవ్వునడచి నిర్జనప్రదేశమున గాలికెదురుగా గూర్చుండుము. గాలి కదలకయుండినయెడల నాగ్నేయమూలాముఖముగ గూరుచుండుము. అట్లుగూరుచుండినపుడు నీరొమ్మును బాగుగ ముందరికి విరిచి పిమ్మట మెల్లగా గాలిని లోనికి పీల్చుము. నీవాపగలిగినంతసేపుంచి మెల్లగా వదలివేయుచు నిశ్చలమనస్సుగలవాడవై సుమారిరువదియారుపర్యాయములు ప్రతిదినమును జేయుచుండుము. ఇట్లు మండలదినములు లాచరించిన నీ మనంబున కొక యుత్సాహమును, ధైర్యమును బొడముచుం

మును. మండలాంతిమున పరిశుభ్రమగు యద్దము నొకదానిని దెప్పించి నీప్రతిబింబమందుజూచుచు "ఆహా! యేమి నారూపలావణ్యము? నాకన్న యందముగ నుండువారలెవరు? నా భాగ్యమేమని చెప్పవచ్చును" అని నీలోనీవొక గదిలోనికి ప్రవేశించి యనుకొనుచుండుము. ఇట్లు పదునైదుదినము లభ్యాసము చేసిన తదనంతరము నీదేహబలమునందును రూపలావణ్యమునందును తారతమ్యత నీకే తెలియునుగాక.

రూపాయిని చరచర ప్రాకివచ్చునట్లు చేయగలుగుదునా లేదా యని ప్రశ్నించుకొనినప్పుడు నీవద్దనుండు పెన్సలునొకదానిని నున్నని స్థలమునందుబెట్టి దానికెదురుగా సుమారిరువదియంగుళముల దూరమున గూరుచుండి కదలిరమ్మని నీమనోశక్తి నుపయోగించుము. అప్పుడు పెన్సిలు చక్రము దొర్లినట్లు దొర్లుచు నీసామీప్యమునకు వచ్చును. అట్లు రానిచో నీవింకను కొన్నాళ్ళు సాధనము (Practice) చేయవలసి యుండును. మరల కొన్నాళ్ళు సాధనముచేసిన పిమ్మట తప్పక కదలివచ్చును. ఇటువంటి యభ్యాసమును చేయువారు ముప్పదియైదు సంవత్సరములకు లోపువారైనచో త్వరలో శక్తిని సంపాదింపగలవారగుదురు. ఏవస్తువునైన కదలివచ్చునట్లు జేయదలచిన యెడల నావస్తువుయొక్క బరువంతయు (Centre of gravity) నేస్థలమునందుండునో యాచుక్కనంకి సిదృష్టిని నిల్పి కదలిరమ్మని మనోశక్తి యుపయోగించుము. నీమనోశక్తి నెంతటిశక్తితో (Force) ప్రయోగింతువో యంతటి త్వరలో గంతులువైచుచు నడచుచుండును. ప్ర

తివారదద్భుతపడుదురు. ఇటువంటి చిత్రపుపనులను జూచినవా రందరును నీకు మిత్రులగుదురు. నీవు రూపాయి నెట్లు నడిపించితివని నిన్నెవరయిన యడిగినయెడ నేమియునుదాచక యెల్లయును తెల్లంబుగ జెప్పి యతనినిసైతము మనోశక్తిని సంపాదింప ప్రోత్సాహమును జేయుము. ఇట్లు నన్నడిగినవారి నందరను మెస్మరిజమను యీమనోశక్తిని సంపాదించుటకు పలుమారు ప్రోత్సాహమును జేసియుంటిని. తత్కారణమున నాకు మిత్రులగువారందరును సాధారణముగ మెస్మరిజము నభ్యాసము చేయుచుండినవారైరి.

## రూపాయిని గంతులువేయుంచు విధము

రూపాయియొక్క మధ్యభాగమున జూచుచు "గంతులువేయుచు కదలిరమ్ము" అని నీమెస్మరిజ ముపయోగించుము. అప్పుడు రూపాయి గంతులువైచుచు నీవద్దకు పరుగెత్తుకొని వచ్చును. లేక రూపాయిని జరిగివచ్చునట్లు జేయవలెనన్న యంచును చూచుచు "కదలిరమ్ము" అని మనోశక్తితో యనుకొన్నమాత్రమున జరిగిజరిగి నీయొద్దకు నెమ్మదినెమ్మదిగా వచ్చుచుండుట ప్రతివారునుచూచి మిక్కిలి యాశ్చర్యమొందెదరు. అట్లు రూపాయిని నడపించుచున్న సమయమునందు దీపకాంతిగాని మరేట్టికాంతిగాని నీకంటికి తగిలినయెడ నీశక్తి త్వరలో ప్రవేశించి రూపాయి కదలజేయలేదు గావున నీకంటి కెవ్విధమైన కాంతిగాని తగులకుండునట్లుజేసికొని రూపాయిని నడపించుటకై ప్రయత్నము జేయుచుండుము. అట్లు

జేయుచుండిన నీవు ప్రతిపర్యాయమును నడిపించగలవాడ వగుదువు.

చదువరులారా! మీారెవ్వరైన బజారున బోవుచున్నప్పుడు కుక్కలరచుచు గందరగోళమును జేయుచున్నయెడల మీామనోశక్తి యనునది వానినన్నిటి నఱవకుండగ జేయగలదు. ఎట్లన అఱచుచున్న కుక్కలనుచూచి "ఓకుక్కలారా, మీాకఱచుటకు శక్తిలేదు, నోరుమూసికొని యూరకొనుడు" అని నిశ్శక్తి నుపయోగించిన తక్షణమే వానగురిసి చల్లారినట్లు నిశ్శబ్దముగా నుండును.

## చేతిని వంచలేకుండ జేయుట.

ఒకనినిబిలిచి యాతనిచేయిని చాచుమనిచెప్పి పిమ్మట నీదృష్టిని ప్రయోగించుచు మనోదృఢముతో "నీచేయిని వంచజాలవు. నీచేయియందు రక్తము ప్రవహించుచుండుటలేదు. నరములు బలహీనముగ నున్నవి. నీవు చేయిని వంచగలవని నేనననిదాక నీకు వంచుటకు శక్తిలేదు" అని యనుకొనుచు చల్లగా చేయిపై యూదుచుండుము. అయిదారు నిమిషములిట్లు జేసిన తరువాత చేయినివంచమని యడుగుము. పిమ్మట వాడట్లుచేయుట కశక్తుడగును. అదంతయును నీమనోశక్తివలననే జరుగుచున్నది.

ఎవరైన నిద్రబోవుచున్న సమయమున నిద్రనుండి మేల్కొనజేయవలెనన్న యాతని కనుబొమలమధ్య నిదృష్టి ను

పయోగించుచు "లెమ్ము పెద్దమ్మవారు నిన్ను విడచిపోవుచున్నది. నీకిక నిద్రరాదు మేలుకొనుము" అని నీమనోశక్తి నుపయోగించుచు మెల్లగానూదుము. అంతట నిద్రబోవువాడు కొట్టిపిలిచినవానివలె చప్పున మేల్కొనును.

## కోడిపుంజును నిద్రబుచ్చుట.

కోడిపుంజు నొకదానిని దెచ్చి దానిమెడనువంచి రెక్కలసందున బెట్టి కొంచముసేపు పట్టుకొని "నీకు నిద్రవచ్చుగాక" అని దృఢముగా తలంచుచు దానివీపుమీద నినోటితో చల్లగా యూదుము. ఇట్లుజేసిన యైదారునిమిషములకా కోడిపుంజు నిలుచుండియే నిదురపోవుచుండును.

## తేలుబాధ మాన్పుట.

ఎవరినైనను తేలుకుట్టినయెడల కుట్టినచోటున నీదృష్టిని నిలిపి నీమనోశక్తి నిక్రిందివిధమున నుపయోగించుము "తేలువిషము నిన్నేమియు చేయజాలదు. ఒకవేళ నీనరములద్వారా బాధ పైకెక్కినను తప్పక దిగును" అని మనసునందనుకొనుచు బాధగలచోటున చల్లగా నూదుచు చేతితో చఱచుచుండుము. ఈవిధముగ పెక్కువిధములగు బాధలను కడుసులభముగ నీమనోశక్తివలన కుదర్పగలుగుదువు.

## స్నేహమును గలుపుట.

మీగ్రామమునం దిద్దరు బలవంతులొకరికొకరికి స

పడక విరోధముగా నుండిరనుకొనుము. వారిద్దరేకీభవించిన గాని మీ గ్రామమునందు నెమ్మదిగలుగదనుకొనుము అట్టి సమయమున నీవేకాంతస్థలమునకుబోయి వారిద్దరిని మనసునందు తలంచుచు "మీరిద్దరొకరినొకరిని ప్రేమించుకొనుచుందురుగాక. నేటినుండియు నామనోశ్శక్తిప్రభావముచే మీకిద్దరకమితమిత్రత్వము గలుగును" అని ప్రతిదినమును సుమారొక వారమువరకు నీమనోశ్శక్తి నుపయోగించిన వారిద్దరును మిత్రులగుదురు. అందువల్ల మీ గ్రామవాసుల కెంతయు మహోపకారమొనర్చినవాడ వగుదువు గాన చదువరులారా! సమస్త ప్రాణికోటులయందును మనుజుడే యుత్తముడని పరిగణింపబడినందులకు నెద్దియైన నొకపెద్దమహిమను పిన్న పెద్దలందరు బుద్ధికుశలతగలవారై సంపాదింపకుండిన మానవజాతికంతకును మిక్కిలి యవమానకరమైన విషయమైయున్నది. ప్రపంచమునందు ప్రతివానికిని మిక్కిలి సహాయపడునది మనోశ్శక్తి దక్క రెండవదిగాదని చదువరులకెల్లరకును తెలియవచ్చుచున్నది. మనపూర్వీకులెల్లరును యిటువంటి మనోశ్శక్తి ప్రభావముచే మిక్కిలి యద్భుతకార్యములను పెక్కింటిని జేసియున్నారు. అట్టి మహానుభావులగువారి రక్తమునుండి జననమంది మిక్కిలి యాదరింపబడిన మనోశ్శక్తిని సంపాదించుటకు ప్రయత్నింపకుండ సోమరులవలె కాలమును వృథాబుచ్చుచుండ నితరదేశస్థులెట్లు గౌరవింతురు? వారివల్ల గౌరవమును పొందుటట్లుంచి తమదేశమునందు జనించువారి నెల్లరను సోమరిపోతులను జేయుచున్నారే? ఎంతటి ఘోరపాపము! గాన

సోదరులారా! యిక్కనైన మీకుమారులను బంధుమిత్రులగు పిన్నవయసువారినెల్లరను మనోశక్తిని సంపాదింప ప్రోత్సాహము జేయుచుందురని నేను మిక్కిలి గట్టిగా నమ్మియున్నాను. ఈమనోశక్తిని సంపాదించుటకు పిన్నవయస్సుగానుండినయెడల పట్టుబడుట మిక్కిలి సులభముగా నుండును. కాన బాలురగు వారి నెల్లరను విశేషించి ప్రోత్సాహము జేయుచుందురనియు న్ను, మనదేశమంతయు నిట్టి మహాత్తుగలిగిన మనోశక్తియెల్లయెడల నల్లుకొని మనదేశీయులనెల్లర నున్నతదశకు మెల్లగ దీసికొనివచ్చి చల్లగ విడిపించునని నాయుల్లమునుం డెల్లపుడును వెల్లువగా సంతోషం బెల్లయెడలకు నల్లుకొనుచున్నది.

స మా ప్త ము.

---

